# విశ్వజనని



రిచర్డ్ షిఫ్మన్

# విశ్వ జనని



ఆంగ్ల మూలము :

రిచర్డ్ షిఫ్‌మన్

ఆంధ్రానువాదము :

తంగిరాల కేశవశర్మ

ప్రచురణ విభాగము :

శ్రీ విశ్వజననీ పరిషత్

జిల్లెళ్ళమూడి – ఆంధ్రప్రదేశ్




విశ్వజనని

# మా మాట

అమ్మకన్న తియ్యనైన పదం ఈ సృష్టిలోనే లేదు. అమ్మ ఒడి మమతల గర్భగుడి, సమతల పెద్దబడి. అమ్మనుడి వేదవాక్యాల జడి, అనుభవ రత్నాలమడి. అమ్మ సన్నిధి అపు రూప పెన్నిధి. ఇహపరములకొక స్వర్ణవారధి. అమ్మ అనురాగ జలధి. అమ్మ శ్రీలలిత,అనేక కోటి బ్రహ్మాండ జనని, అగ్రగణ్య. అమ్మ సగుణ, నిర్గుణ దివ్య విగ్రహ. అమ్మ సర్వమయి, సర్వాతీత, సర్వశక్తిమయి అమ్మ మహనీయ దయామూర్తి. అమ్మ ప్రేమరూప, ప్రియంకరి. అమ్మ సర్వాపన్నివారిణి. అమ్మ భక్త సౌభాగ్యదాయిని, భక్తి వశ్య, భయాపహ. అమ్మ అద్భుతచారిత్ర. అమ్మ కల్యాణి, కాల హంత్రి - అమ్మ సర్వజ్ఞ సర్వమంగళ, సర్వాధార. అమ్మ స్వరూప లలిత, స్వభావ మధుర అమ్మ విశ్వజనని, విశ్వాధార.

ఒక్కసారి అమ్మను చూచిన వారు పిల్లలైనా పెద్దలైనా, ఆడైనా మగైనా, పశువులైనా పక్షులైనా (అమ్మను వదలి ఉండటం కష్టం. మళ్ళీమళ్ళీ చూడాలనే ఆరాటం సహజంగా ఉంటుంది. అందుకేనేమో అమ్మ అంటుంది తను మనల్ని (సృష్టిని) కని మన తల్లులకు పెంపుడు ఇచ్చిందట. అమ్మకు కులబేధమే కాదు గుణ బేధం కూడా లేదుట. కనపడేదంతా దైవమే నంటుంది అమ్మ జగన్మిధ్యకాదు జగత్తూ దైవమూ వేరు కాదు. అదే ఇదంతా అయివచ్చింది. సత్యమూ అసత్యము, ప్రజ్ఞానమూ అజ్ఞానము, సుగంధము దుర్గంధమూ, సర్వమూ అదే, భగవంతుడు ద్వందాల కతీతుడు కాడు, ద్వంద్వాల కాధారుడు.

తృప్తే ముక్తియని, సంకల్పమే దైవమని, భిన్నత్వం లేక పోవటమే దైవత్వం అని పరిమితిగల మమకారం మానవత్వం, సర్వత్ర ఉన్న మమకారం మాధవత్వమని, అందరికి సుగతేనని అమ్మ చాటి చెప్పింది. నీకున్నది తృప్తిగా అనుభవించు. ఇతరులకు ఆదరంగా పెట్టుకో, అంతా ఆదైవమే చేయిస్తున్నాడనుకో అని జగతిలోని మానవాళికి దివ్య సందేశాన్ని ప్రసాదించింది.

జిల్లెమూడిలోని అందరిల్లు విశ్వకుటుంబము. అక్కడ ఎవరి అన్నం వారికుంటుంది. దేశవిదేశాల నుండి ఆర్తులు జిజ్ఞాసులు వచ్చి ఆవాతావరణంలో ఉపశమనం పొందుతుంటారు. అమ్మ గుర్తుచూపించిన వాడే గురువు అంటుంది. వాళ్ళగుర్తించే గురి ఇక్కడే కుదిరిందేమో మరి. అలా అమ్మను గురువుగా, దైవంగా, మాతృమూర్తిగా ఎలా భావించి వచ్చినా అమ్మలోని అతిలోక దివ్య ప్రేమశక్తికి ఆకర్షితులు కానివారు ఎవరూ ఉండరు. ఆ ఆప్యాయత, ఆ ఆత్మీయత, ఆ అనురాగము. ఆ వాత్సల్యము అద్వితీయమైనది అనిదంపూర్వమైనది రాయినీ రప్పను, పామును-పక్షిని, నీటిని నిప్పును, సృష్టిలోని చరాచర జగత్తును దైవంగా భావించి పూజించే ఈ భారతభూమిపైన అమ్మ అవతరించడం అందునా మన ఆంధ్ర దేశంలో అవతరించడం మన అదృష్టం. అమ్మను చూచి, అమ్మతో మాట్లాడి అమ్మ ఒడిలో ఓలలాడే అదృష్టానికి నోచుకున్నాం అలా అదృష్టాన్ని పొందిన సోదరీ సోదరులలో "రిచర్డ్ షిఫ్మన్" ఒక విదేశీ సోదరుడు.

రిచర్డ్ షిఫ్మన్ మధ్య అమెరికా దేశంలో న్యూయార్క్ పట్టణంలోని సంపన్న కుటుంబానికి చెందిన యువకుడు. పురా

తత్వశాఖలో మానవ పరిణామ వికాస శాస్త్రాన్ని అభ్యసించిన విద్యోపాసకుడు. చదువుతున్న రోజులలో అధునిక అమెరికా యువకులవలెనే విలాసవంతమైన జీవనం గడిపి దానిలో తృప్తిని పొందలేక ఆ జీవన విధానం నుండి విడివడి తనకు ఒక గ్రంథాలయములో దొరికిన భగవద్గీతను చదివి ముగ్ధుడై పరవశించిన భాగ్యశాలి. అమెరికాలోని దైవీ శక్తి సంపన్నులమని, యోగులమని చెప్పుకొనే వారిని చూసి,శుశ్రూష చేసి నచ్చక భారతీయ సంస్కృతి సంప్రదాయాల పట్ల ఆకర్షింపబడి భారత దేశంలో ఋషులు, యోగులు, మహనీయులు, జీవన మార్గ దర్శనం చేయగలరనే నమ్మకంతో వచ్చి ఆసేతు శీతాచలం పర్యటించి ఎందరో మహానుభావులను, మహర్షులను, యోగి పుంగవులను, సర్వసంగ పరిత్యాగులై ఆశ్రమవాసం చేస్తున్న వారిని దర్శించి దర్శించి నిరంతరంగా సాగిన తన సత్యాన్వేషణలో యాదృచ్ఛికంగా జిల్లెళ్ళమూడి అమ్మను దర్శించి తను అన్వేషిస్తున్న సత్యపదార్థాన్ని అమ్మలోచూచిన అదృష్టవంతుడు. అమ్మను అధ్యయనం చేసి ఆ అధ్యయనంలో ఆత్మావలోకనం చేసిన బ్రహ్మచారి. సమాజ పరమేశ్వర ఆరాధనలో భాగంగా మాతృశ్రీ మెడికల్ సెంటర్ నిర్వహణబాధ్యత వహించిన సమాజ సేవకుడు. అన్నీ ఉన్న విస్తరి అణిగిమణిగి ఉంటుంది అన్న సామెతకు నిదర్శనంగా అతి నిరాడంబరంగా జీవనం గడిపే బాటసారి. పత్రికా రచయితగా తన అనుభవాన్ని సత్య సందర్శనం చేసిన అనుభావిగా తన సునిశిత పరిశీలనా దృష్టిని, తృప్తిని పదిమందికీ పంచాలనే తపన అతనిచేత "Mother of All" అనే గ్రంథాన్ని రచియింప చేసింది. విదేశీయులకు ఆంధ్రభాషేతరులైన స్వదేశీయులకు ఆంగ్లంలో వ్రాయబడిన

ఆ గ్రంథం అమ్మను గూర్చి తెలుసుకోవడానికి ఎంతో మేలు చేసింది, చేస్తున్నది.

అందులోని "జిల్లెళ్ళమూడికి నా యాత్ర" అనే భాగం చదివి ఆ రచనా వైభవానికి, అనుభవాన్ని చెప్పే తీరులోని నైపుణ్యానికి ముగ్ధుడైన సోదరుడు తంగిరాల కేశవశర్మ దానికి ఆంధ్రానువాదం చేసాడు.

శ్రీ కేశవశర్మ అమ్మవద్దకు మూడు దశాబ్దాలుగా వస్తున్న భాగ్యశాలి అమ్మ అనురాగాన్ని, ఆప్యాయతను జుర్రుకొన్న అదృష్టవంతుడు. జీవితంలో అడుగడుగునా అమ్మ ఇస్తున్న అనుభవాలతో తరిస్తున్న తపో సంపన్నుడు. కష్టంగాని సుఖం గాని ఏదైనా అమ్మ ప్రసాదమని భావించే సమ్యగ్జీవి.

శక్తి వంతమైన అతని అనువాదవైఖరి మూల రచనలోని భావానికి ఏమాత్రం అన్యాయం జరగకుండా మూలం కన్నా రమణీయంగా, రసవంతంగా తయారవటాన్ని అనువాదం విన్న సోదరీ సోదరులలో కలిగించింది. ఒక విదేశీ సోదరుని సునిశిత పరిశీలనానుభవాన్ని అమ్మను గూర్చి విన్నవారికి విననివారికి కూడ అందించాలనే ఈమా ప్రయత్నం సర్వసమాదరణీయం అవుతుందని ఆశిస్తున్నాం. రచయితకు అనువాదకునికి మా కృతజ్ఞతలు.

విశ్వజనని సేవలో
మీ సోదరులు



అనసూయేశ్వరాలయంలో అమ్మ

# విశ్వ జనని

## ఆధారం

దక్షిణభారతంలో జిల్లెళ్ళమూడి గ్రామంలో ఒక అమ్మ ఉన్నది. తన పిల్లలకు అన్నం పెడుతుంది. వారి అనారోగ్యంలో సాకుతుంది. వారిని మందలిస్తుంది. ఆప్యాయంగా బుజ్జగిస్తుంది. ఆపదలో ఓదారుస్తుంది. సుఖదుఃఖాలలో వారి కన్నీళ్ళు తుడుస్తుంది. ఆ అమ్మ దాదాపు అందరిపలెనే ఉంటుంది. చూపులోగాని, తీరులోగాని – మామూలు గుంపునుంచి విడదీసేందుకు ఏరకమైన విశేషం గాని, వ్యక్తిత్వలక్షణం గాని కనపడదు. అయినా ఒక్క విశిష్ట లక్షణం లేకపోయినట్లయితే ఇప్పటివలె ఆమె వేలాది మంది చేత ఆరాధింపబడటం కాదుగదా ; కనీసం గమనింపబడి ఉండేవారు కూడాకాదు. అందరి తల్లులనుంచి అమ్మను విడదీసి చూపుతున్న ఆ ప్రత్యేక లక్షణం ఏమిటి ? ఒక్క మాటలో చెప్పాలంటే – సామాన్యంగా మనం మన ఆపేక్ష. ఆప్యాయతలకు పరిధులు గీసుకుని గర్భవాసాన పుట్టిన వారినే మన సంతానంగా భావిస్తాం. కాని అమ్మ అలాకాదు, సర్వమూ తనసంతతిగానేభావిస్తుంది. సకల మానవులు, జంతువులు, వస్తువులు, ఆలోచనలూ, గుణాలూ సర్వమూ, అందరినీ – అన్నింటినీ ఎక్కడున్నా గాఢమైన ఆపేక్షతో, ప్రేమాదరాలతో, దయతో తల్లి తన కన్నబిడ్డను చూసినరీతిలో పరామర్శిస్తుంది.

సమస్త విశ్వంలో దేనినీ ఈ అమ్మ జడంగాచూడదు. చైతన్యరహితంగా చూడదు. ఈ అనంత సువిశాల చైతన్య ప్రవాహంలో నామరూపావస్థా వైవిధ్యంతో ఎడతెరపిలే కుండాతన సంతానాన్నే చూస్తుంది. అమ్మలో మూర్తీభవించి భాసిల్లే సంపూర్ణమైన ప్రేమ, ఏకత్వదృష్టి మానవజీవితంలో పొందదగిన ముకుటాయమానమైన ఘనవిజయాలు. వానికి ఉన్ముఖమయిన గమనమే అరుదు, గమ్యం చేరుకో టం మరీ అరుదు. కాని అమ్మవిషయంలో వానికై గమనమూ గమ్యంచేరుకోటం అనే ప్రశ్నలేలేవు. మొట్టమొదటి నుండి అమ్మ ఒకే విధంగా ఉన్నది. అదృష్టవంతు లయిన ఏ కొద్దిమందో అమ్మ చిన్నతనంలోని ఉన్నతస్థితికి తార్కాణా లుగా నిలచారు.

తరచూ ఎందరికో అమ్మబాల్యంలో అద్భుతమని పించే అసాధారణ దర్శనాలు కనిపించేవి. అమ్మను కృష్ణ పరమాత్మునివలె, రాజరాజేశ్వరీదేవివలె, క్రీస్తుభగవానుని వలె, ఇంకా ఎన్నో దేవతారూపాలలో ఎందరెందరో దర్శ నానుభూతులు పొందారు. సర్వసాధారణంగా చాలామంది అపసికందులో పరమ పవిత్ర వ్యక్తిత్వాన్ని, మహోన్నత మాతృత్వాన్ని గుర్తించారు. అర్ధశతాబ్దికితం ఏ లక్షణాల మూలంగా అమ్మవైపు ఆకర్షితులయినారో అవే లక్షణాల వలన అసంఖ్యాకులయిన యాత్రికులు నేడు జిల్లెళ్ళమూడికి ఆకర్షితులవుతున్నారు.

జిల్లెళ్ళమూడి గ్రామంలో అమ్మచుట్టూ వర్ధిల్లిన 'అందరిల్లు' నేడు దేశంలో ప్రధాన ఆధ్యాత్మిక కేంద్ర మైంది. ఆంధ్రదేశం నలుమూలలనుంచి అసంఖ్యాక జనం అమ్మ దర్శనానికి వస్తారు. దేశంలో ఇతర ప్రాంతాలనుండి విదేశాలనుండి వచ్చేయాత్రికుల సంఖ్య పెరుగుతోంది. రావటంలో గల కారణాలు వచ్చే యాత్రికులవలెనే ఎన్నో రకాలు. అద్భుత శక్తుల గురించిన కథలతో ఆకర్షితులై కొందరు, అనారోగ్య నివారణకై కొందరు, సంతానానికై కొందరు, వ్యాపార విజయానికై కొందరు- ఇలా ఎన్నో విధాలు. ఆధ్యాత్మిక జిజ్ఞాసువు లయిన మరికొందరు ఒక 'మహాయోగిని' నుండి ఆశీర్వచనానికై, మార్గదర్శనం కోసం వస్తారు. తత్వ పరిశోధకులు అమ్మ జ్ఞాన సీమను కొలవాలని కొందరు, అమ్మనుండి సంశయనివృత్తికై కొందరు వస్తుంటారు. సంప్రదాయకులయిన హిందువులు ఆదిశక్తి అవతారంగా భావించి అమ్మను శాస్త్రోక్త రీతిలో పూజించుకునేందుకు వస్తారు. ప్రారంభంలో ఏ ఉద్దేశ్యంతో మనం అమ్మను చూచేందుకు వచ్చినా, తిరిగి తిరిగి, మళ్ళీ మళ్ళీ రావటానికి మాత్రం అందరికీ ఒకటే కారణం. అమ్మలో మనం మహోత్కృష్టమైన ప్రేమకు, ఉన్నతమైన ఆధారము నకు మూలాన్ని చూడటమే కారణం. అమ్మ అనే పదానికే ఎంతో నిజమైన గొప్పదయిన భావాన్ని అమ్మలో చూస్తాం.

అమ్మ సాన్నిధ్యంలోకి మనం మొదటిసారి వచ్చినప్పుడు మనలను అంతకుముందే ఎరిగి ఉన్నట్లుగా, మనం ఏమాత్రం క్రొత్తవారం కానట్లుగా అచ్చెరువుగొలిపే పరిచిత దృష్టితో గమనిస్తుంది. అమ్మ ముఖకవళికలలో పరమ ప్రశాంతతతో బాటు ప్రకాశవంతమయిన అతిలోక లక్షణం ఉంటుంది. అయినా తనచుట్టూ చేరిన వారిని చూస్తూంటే - ఆ చూపులో, హావభావాలలో తల్లి కనబరచే ఆసక్తి గోచరిస్తుంది.

మామూలుకన్నా పెద్దదయిన కుంకుమబొట్టు కనుబొమల మధ్య ఉండటంతో విశేషప్రాధాన్యంగల అమ్మ కనులవైపు మనం ఆకర్షితుల మవుతాం. ఏమాత్రం వ్యాకుల పాటు, స్వీయప్రజ్ఞ అనే బుడగలులేని నిశ్చల కాసారాల వంటి అమ్మకళ్ళు అందనిలోతులతో నిండైన సూక్ష్మశక్తితో నిలదీస్తుంటాయి. అమ్మ మనలను చూస్తున్నప్పుడు ఆదృష్టి మన అంతరంగపు అడుగులదాకా సోకుతుంది. అయినా మనం ఏ ఇబ్బందికి గురికాము. ఎందుచేతనంటే ఆ దృష్టి పరమ సున్నితమూ, సన్నిహితమూ, ఉపశమనకారకమూ అయిందికనుక, అజ్ఞాతమైనదేదో మనలో జాగృతమై కదలుతుంది. చాలామంది చెప్పలేని భావోద్వేగానికి లోనై విలపిస్తారు. కొందరు పరమ ప్రశాంతత మృదువుగా అవతరించటం అనుభవిస్తారు. అమ్మ ప్రశాంత వీక్షణలో యుగాలుగా మరచిన పరమరహస్యం ఒక్కమాటుగా మన ముందుంచి

నట్లు, దాదాపు అందరికీ పోగొట్టుకున్నదేదో కాళ్ళకు చుట్టు కున్నట్లు అనిపిస్తుంది.

'అమ్మకు సర్వమూ తెలుసు - అమ్మకు సర్వమూ సమ్మతమే' అని స్ఫురణాత్మకంగా గ్రహిస్తాం. ఈ అవగాహనతోపాటు ఎంతోకాలంగా భయదోషాల తీవ్రభారం మోయటానికి అలవాటు పడిన మనస్సునుండి ఊపిరి సలపనీని బరువును మొదటిసారిగా ఎత్తివేసినట్లు మనసు చక్కటి స్వేచ్ఛాభావన పొందుతుంది. కృతజ్ఞత నిండిన మూగ ప్రార్థనతో మన అంతరంగం ఊర్ధ్వలోకాలకు దూసుకు వెళుతుంది. అపారమైన సువిశాలమయిన ఆంతరనిశ్శబ్దంలో 'అమ్మ' అనే ఒక్కపదం అప్పుడప్పుడు మృదువుగా ప్రతిధ్వనిస్తూ ఉంటుంది. అప్పటికి పూర్తిగా అంతుపట్టకపోయినా, ఒకరకంగా ఇంటికి తిరిగి చేరుకున్నట్లు మనకు అవగత మౌతుంది.

మనలో చాలామందికి ఈ మొదటి భావోద్వేగం త్వరలో వాడిపోయి, మనకు అనుభవంలో ఉన్న ప్రతిస్పందనలూ, మనోవృత్తులూ చోటు చేసుకుంటాయి. అయినా మనకు ప్రసాదింపబడిన ఈ అద్భుతమయిన దివ్యదర్శనం మాత్రం మరచిపోలేం. నాటిన విత్తనంవలె ఎదలో పదిలమై అస్పష్టంగా ఉండి అతిలోక జీవన పిపాసగా పరిపక్వమై తీరుతుంది.

ఆపుకోలేనంతగా ఎంతోమంది ఎందుకు మళ్ళీమళ్ళీ జిల్లెళ్ళమూడి వస్తూంటారో కొంచెం సమయం అమ్మ దగ్గర కూర్చుంటేచాలు తెలుస్తుంది. ప్రతిరోజూ అమ్మ ఉండే చిన్న గదిలో ఎడతెగకుండా యాత్రిక జనతా ప్రవాహం సాగుతూనే ఉంటుంది. చాలామంది కొద్దిసేపు అమ్మతో సంభాషిస్తూనో, మౌనంగా గమనిస్తూనో ఉంటారు. ఏరోజుకారోజు ప్రపంచంలోని సుఖదుఃఖాల బరువునంతా అమ్మపాదాల ప్రోల క్రుమ్మరించినట్లుగా ఉంటుంది. ఎన్నడూ తరుగుతున్నట్లు తోచని ఆసక్తితో ఎంతో ఓర్పుతో శ్రద్ధగా అందరూ చెప్పేది వింటుంది. ప్రతి ఒక్కనికి ఆప్యాయతతో రంగరించిన ఒక మంచి మాటో, చిరునవ్వో, బుజ్జగింపో ఏదో ఒక్కటి పదిలపరుస్తుంది, ఏ ఒక్కరినీ వదలదు. ఏ ఒక్కరినీ తిరస్కరించదు. జిల్లెళ్ళమూడికి ప్రయాణం ఎలాసాగిందీ, భోజనం చేసిందీ లేనిదీ, వ్యక్తిగత విషయాలతో సహా పరామర్శిస్తుంది. అమ్మ తీరు ఎంతో నిరాడంబరంగా మనలను ఎంతో హాయిగా ఉంచుతుంది. అమ్మ ముఖకవళికలెంతో కాంతివంతమై స్నిగ్ధమై, మార్దవంగా ఉంటే, అమ్మ మాటలు మెత్తగా హాయిగా ఉంటూనే నిశ్శబ్దంగా ప్రభుత చూపుతాయి. ఆరితేరిన కళాకారునివలె అమ్మ అల్లిన గొప్ప సంతోష సమన్వయ వాతావరణంలో పీటముడి పడిన సమస్యలు మంచులా కరగిపోయి, ఆందోళనతో బిగిసిన ముఖాలన్నీ దరహాసభాసురా లవుతాయి. పునీతం చేసే గొప్ప

ప్రవాహంలో మనం ప్రక్షాళితులమయినట్లు నూతనో త్తేజంతో మనం అందరం అమ్మగదిని వదిలివస్తాం.

జిల్లెళ్ళమూడిలో మనసు నాకట్టుకోగల రూపంతో, పరిసరాల నుండి విడివడి, రోజూ తటస్థపడే చీకూచింతలకు అతీతమైన అంతర్ముఖత్వం కలిగిన శక్తిసంపన్నుడయిన 'యోగి'ని చూడాలని బహుశ మనం అనుకుని ఉండవచ్చు తద్భిన్నంగా మనం పరిసరాలను సావధానంగా ఆసక్తిగా గమనిస్తున్న మాతృమూర్తిని చూస్తాం. పూర్తినిరాసక్తత నిర్లిప్తత ఉంటుందని మనం ఎదురుచూచినచోట, అన్ని ఆచరణాత్మక సన్నివేశాలలో సంపూర్ణమైన ఆసక్తి, వాని లోని వివిధ అంశాలపై ఎంతో జాగరూకత మనకు కనపడు తుంది. పచ్చియోగ విభూతుల దర్శనంకాక, అణకువలో వికసించిన అలవికాని మృదురీతిని అమ్మయందు మనం అనుభవిస్తాం. సాధారణంగా ఈమాట (అణకువ) తో చెలా మణీ అయ్యే తనను తానుకించబరచుకొనే స్వభావం కాక, ఎవరినైనా దేనినైనా చిన్నచూపు చూడటానికి వ్యతిరేకించే అణకువయిది. పిచ్చివాడు కానీ, పసివాడు కానీ, మంత్రి గానీ, దారినపోయేకుక్కగానీ అందరిపైనా ఒకే దృష్టి బరిపే చైతన్యస్రవంతి మీద అమ్మకు గల ఆదరమే దీనికి కారణం. అందరినీ ఒకేవిధమయిన ప్రేమతో ఆదరంతో చూస్తుంది. తనను అందరిలో చూస్తున్నది కనుక.

అమ్మ హృదయంలో తనకు మాత్రమే ఒక ప్రత్యేకమయిన స్థానం ఉన్నదని ప్రతివ్యక్తి ఒక స్పష్టయిన అభిప్రాయానికి వస్తాడు. వచ్చేసోదరులు అసంఖ్యాకంగా ఉన్నా ఈ అభిప్రాయం కలగడం గమనించ తగిన విషయం. అనుపమానంగా అనుగ్రహింపబడ్డామని ఊహాలోకాల్లో ఉన్న మనకు ప్రతివాడూ అలాగే భావించడం చూసి ఆశ్చర్యపోతాం. ఒకరకంగా 'అమ్మదృష్టిలో మనం ప్రత్యేకం' అని ఆలోచించుకోవడం తప్పేంకాదు. నిజానికి ప్రతివాడూ తన అనుగుబిడ్డడే కనుక ప్రతి ఒక్కరమూ అమ్మకు ప్రత్యేకమే. ప్రతి ఒక్కడూ పోగొట్టుకోలేని, వదలుకోలేని, విలువయినవాడే అమ్మకి.

మనకు త్వరలోనే అవగతమవుతుంది. మనకు సర్వసాధారణంగా లభ్యమయే – పొగడ్తలకు లొంగేటువంటిదీ, ఎరచూపి పొందగలిగినట్టిదీ, స్వాధీనంచేసుకోవాలని తహతహలాడేదీ, చూపించిన ప్రేమకు ప్రతిఫలాపేక్ష కోరేదీ అయిన సంకుచిత వ్యక్తిగత ప్రేమకాదు. అమ్మది. తద్భిన్నంగా అమ్మచూపే ప్రేమలో ఏమాత్రం బలవంతంగాని, బంధంగాని కనబడదు. అది పూర్ణంగా స్వతంత్రమయినది. పొందే వాడిని కూడా స్వతంత్రంగానే వదుల్తుంది.

జీవదాయకమయిన తనకిరణప్రసారం పొందేందుకు పచ్చాటి చెట్లన్నీ విచ్చుకుని తన కిరణోన్ముఖం కావాలని

సూర్యుడు వత్తిడిచేయనట్లే, అమ్మ ప్రేమ కూడా మనకు యిష్టమైతే స్వీకరించవచ్చు, లేకపోతే తిరస్కరించవచ్చు, అనే స్వేచ్ఛలోనే మనలను ఉంచుతుంది. బ్రహ్మాండ మయిన మఱ్ఱి చెట్టు పైనగానీ, గడ్డిపరకమీద గాని వివక్షత లేకుండా సూర్యకిరణాలు ప్రసరిస్తూనే ఉంటాయి. ప్రతి మొక్క తాను ఓపినంత శక్తినే తీసుకుని తన స్వభావానికి అనుగుణమయిన రీతిలో పెరగటానికి ఆశక్తిని ఉపయో గించుకొంటాయి. స్వీకరించేవాడి అవసరాలకు అనుగుణం గానే ప్రేమ ఆదరింపబడి స్వీయగతమవుతుంది.

అమ్మ ప్రేమలో లక్ష్యంలేదు. దానిదైన పథకంలేదు. ప్రేమించడంలోని ఆనందంకోసమే - ప్రేమించకుండా ఉండ లేదు కనుక. ఆ ప్రేమకు ఫలితాలను గూర్చికాని, ఘన విజయాలను గూర్చికాని లెక్ఖలేదు. ప్రాపంచికమయిన జయ పరాజయాలకు, గుణదోషాలకు, జమాఖర్చులకు కోట్ల యోజనముల కావల ఉన్నది ఈ తల్లిప్రేమ. పరిస్థితు లను మార్చాలని అసహనంలేదు దానిలో - ఎందుకంటే అన్నీ శాశ్వతంగా పూర్ణమైనవేనని తనకు గుర్తే కనుక.

కానీ చిత్రం ఏమిటంటే మార్పు తేవటంలో ప్రేమకు ఉన్న శక్తి మరి దేనికీ లేదు. తన సార్వభౌమికమయిన ఇచ్ఛతో ఆప్రేమ మార్పుచేయలేనిదేమీలేదు. బాహ్యదృష్టికి

అకర్మణ్యంగాతోచినా ప్రేమలో లవలేశంచాలు ప్రపంచాలు తుదిదాకా పరిభ్రమింపచేయటానికి.

అమ్మ తన మంచం మీద ప్రశాంతంగా కూర్చుంటుంది. అమ్మ ఏమీ చేస్తున్నట్లు కనపడదు. తాను ఉండే గది, దాని ఆవరణ దాటడం అరుదు. జిల్లెళ్ళమూడి అసలు వదలదు. పుస్తకాలు వ్రాయదు. ఉపన్యాసాలు యివ్వదు. గంటల తరబడి తన మంచం మీద మౌనంగానో, తనను పూజించుకునేందుకు, భక్తిప్రపత్తులు ప్రకటించుకునేందుకు బారులుతీరే ప్రజలతో ఇష్టాగోష్టి మాట్లాడుతూనో ఉంటుంది. కానీ ఒక అవ్యక్తప్రభావం అసంఖ్యాకమయిన తన బిడ్డల జీవితాలలో రూఢి అయిన పరిణామం తెస్తూ తెస్తూ ఉంది. ఏదో ఒకనాడు ప్రపంచానికి కాంతినీయగల వేలాది హృదయాలలో చిన్నజ్యోతి వెలిగించబడుతున్నది.



*

మన జీవితాల్లో ఒకానొక నిగూఢ రహస్యం పనిచే స్తుంది. దానిని గ్రహించలేక పోవటం చాలా తేలిక. ముక్కును నేలకు అంటిపెట్టి ఉంచి, ఆ క్షణంలో ఎదురుగా ఉండే దాన్నే చూస్తు, ముందున్న జాడనుగానీ, అప్పటికే దాటిపోయిన ప్రాంతాన్నిగానీ తలయెత్తి చూడనే చూడని వేటాడే జాగిలంలా మనం జీవితంలో అత్యధిక భాగం జీవిస్తాం. ఆవిధంగా మనం ఒక నిర్దిష్టమైన దిశగా సాగు తున్నామనీ గుర్తింపదగ్గ మూలస్థానం నుండి బయలు దేరామనీ స్పృహలేకుండా జీవితం గడిపివేయడం చాలా తేలిక. ఎంతోభాగం అగమ్యంగా కొట్టుకుపోతూ ఉంటాం. తగినంతసేపు జీవనపథ మధ్యంలో ఆగి తత్ప్రదేశాన్ని సమీక్షించి, నడుస్తున్నమార్గంపై దృష్టినిలిపి, దాని గతి విధానాలను గుర్తించి ఈ నడక ఒకానొక బృహత్పథకపు లేదా విధియొక్క అసమగ్ర ప్రతిబింబం కాదుకదా ! అని ఆశ్చర్యపడే ముహూర్తం ఒకటి మన జీవితాల్లో వచ్చితీరు తుంది.

ఊరకంగా నాజీవితాన్ని నేను పరిశీలించినప్పుడు, నేనొక ప్రయాణం చేస్తున్నాననిపిస్తుంది. ఈ ఉన్నత దృక్పథం నుంచి చూస్తే, కష్టసుఖాలు, తప్పొప్పులు, వెనుకా ముందూలేక క్రమరాహిత్యంతో కూడిన సుదీర్ఘమైన అగమ్యగమనాలు, అంధకారమయమైన అగాధాలు, ప్రకాశ

మానమైన శిఖరాలు - అన్నీ అవసరమేననిపిస్తాయి. ప్రతి ఒక్కటీ దాని సముచిత స్థానంలోనే ఉంది. నిర్దుష్టంగా తర్కబద్ధం కాకపోయినా జీవితానికొక ఖచ్చితమైన అర్థం ఉంది: ప్రాదేశికమని ఖండితంగా చెప్పలేని ఒక గమ్యం దానికుంది — అది నేనింతకు పూర్వం చూడనిదిగానీ, యిప్పుడు చూడబోతున్నదిగానీ ఖచ్చితంగా కాదు; దానికి తుది గమ్యంతోగానీ, మలుపులతో కూడిన సుదీర్ఘమైన గమన పథంలోగానీ అభిన్నమైన ఆది ఉంది; దేశకాల రేఖాచిత్రపటద్వయంమీద గుర్తింపదగ్గ ఈ ప్రయాణానికి గానీ, మరియే యితర ప్రయాణానికిగానీ మూలస్థానమది.

ప్రశాంత చింతనకులోనయ్యే ఈక్షణం; ప్రతిఒక్కటీ దాని స్థానంలోకి విచిత్రంగా ఒదిగిపోయే విశ్వైక "అహం" భావనతోచే యీక్షణం; "నేనెవర్ని?" అనే మౌలిక స్ఫురణ లో నిగూఢ రహస్యాలూ, వాటి భాష్యాలూ లీనమైపోయే యీక్షణం అద్భుతమైనది. ఈ క్షణిక దర్శనం ఎంతో అరుదైనది — జరుగుతూండగానే మఱుపునకొస్తుంది, జరిగిన తక్షణమే దుర్గ్రాహ్యమై పోతుంది. తేటతెల్లమైనదైనా బయటనుంచి గోచరం కానిది, అది స్వప్నాలసారం, అయినా తక్కినదంతా స్వప్నంగా భ్రమింపచేసే ప్రాబల్యం గలది. అదే "సత్యము". కాని మనకది సున్నితమైందిగానూ, అస్థిరమైందిగానూ కన్పిస్తుంది, మనమెంత గట్టిగా జాడని

అంటిపెట్టుకొని ఉన్నా అది మన నాసికల క్రింది నుండి మాయమయ్యే అస్థిర సత్యమైనప్పటికీ. నిర్దిష్ట క్రమరాహిత్యములూ, పరస్పర సంబంధ రాహిత్యములూ అయిన క్షణాలతో గూడిన పసిగట్టే జాగిల జీవితమే మనకు నిజమని పిస్తుంది.

విధి ఎంతో నిర్దయగా ఉందని తోచిన సమయంలో కూడా నిజానికి విధి దయకలిగి ఉంటుంది. అది మన మార్గంలో ఒక అవరోధాన్ని ఉంచుతుంది. కానీ ఆ అవరోధమే మనకవకాశం - ఆ అవరోధమే జాగిలాగ్ని, తనకిష్టం లేకపోయినా, జాడ నుండి తలయెత్తి, ఆశ్చర్యంతో చూసేటట్టు చేస్తుంది. మొట్టమొదటి సారిగా తన వేట పారవశ్యం నుంచి దాన్ని మేల్కొల్పుతుంది. మొట్టమొదటిసారిగా తన ఎరతో తాను ముఖాముఖిగా ఉండటాన్ని గమనిస్తుంది. కాని తాను ఆశించినదిగానీ, తను ఆశించవలసినదిగా ఆదేశింపబడినది గానీ అదికాదు. ఎందుకంటే, తనే ఆ ఎర; వేటాడేదీ వేటాడబడేదీ తనే: అన్వేషకవస్తువూ అన్వేషిత వస్తువూ తనే: మూలమూ, గమ్యమూ కూడా తనే. తన నిర్దుష్ట నిజ ప్రతిబింబాన్ని మొదటిసారిగా తను చూసుకొన్నది ఈ అవరోధమనే అద్దంలాంటి సరస్సులోనే.

కాబట్టి, ప్రియపాఠకులారా : తోటి ప్రయాణీకులారా: ఈవిధంగా సాగుతుంది ఒక ప్రయాణం, నా ప్రయాణం,

మీ ప్రయాణం, మన అందరి ప్రయాణం కూడా. ఇది ఒక కల్పనగా కన్పించవచ్చు, కానీకాదు. ఇది యదార్ధ ప్రయాణగాథ – నావరకు ఒక వాస్తవ స్థలంలో ముగిసిన ప్రయాణగాథ యిది. అ స్థలమే దక్షిణ భారతదేశంలోని జిల్లెళ్ళమూడి అనే చిన్న గ్రామం. జిల్లెళ్ళమూడి నాకు అవరోధమూ, అవకాశమూను. కాని ప్రయాణం అక్కడ ముగిసిందనడం కేవలం అర్ధసత్యమే అవుతుంది. ఒక విధంగా ప్రయాణం మొదలైందే అక్కడ. జిల్లెళ్ళమూడి ప్రయాణం పరిసమాప్తి కాలేదు. జిల్లెళ్ళమూడిలో ఒక మహా యోగి (ని) కళ్ళలో నా నిజప్రతిబింబాన్ని క్షణకాలం చూశాను. ఆమె ప్రశాంతతలో నా నిజప్రతిరూపం నాకు కన్పించింది. కాని అది కేవలం ప్రతిబింబం మాత్రమే. దాన్ని అందుకోవటమంటే పోగొట్టుకోవడమే; పోగొట్టుకోవడమంటే మళ్ళీ మళ్ళీ దానికోసం అన్వేషించడమే, మున్నెన్నడు పోగొట్టుకోని దానికోసం డొల్ల అయిన నత్తగుల్ల వంటి ప్రతిబింబంగా తప్ప బయట ఎక్కడా దొరకని దాని కోసం వెదికే అన్వేషక నిపుణుడిగా మార్పు చెందడమే.

కాబట్టి ఇది యింకా పరిసమాప్తికాని ఒక ప్రయాణ గాథ – ఆ ప్రయాణమే జిల్లెళ్ళమూడి ప్రయాణం; నిజానికది ఆత్మవైపు ప్రయాణం. ఒక ప్రతిబింబ దర్శనం, అన్వేషణ, ఒక ఆదర్శం పట్ల శ్రద్ధ కూడిన ఈ దశ అవశ్య పూర్వరంగంగా నాకంటె విజ్ఞులైన వారుకూడా, భావిస్తారు.

జాగిలం తనకెన్నడూ కానరానిదీ, తాను నిజానికెప్పుడూ విడిచిపెట్టనిదీ అయిన స్వస్థానంలో అలసిసొలసి కూల బడేంత వరకూ జలాశయపు గట్టుచుట్టూ నిర్విరామంగా పరిగెత్తుతూ తన ప్రతిబింబాన్ని తరుముతూ ఉండాల్సిందే నని వారంటారు. దీనిగురించి, విన్నమాటగానే కాని అను భవతః నేను నివేదించడం లేదు. ఎందుకంటే ఈనాటివరకు నా అనుభవం వేటకు సంబంధించిందేకాని, అలసి సొలసి శరణాగతి పొందడం వల్ల వచ్చిన సాఫల్యతకు సంబంధిం చింది కాదు.

బహుశా ఏదో ఒక రోజు మనం ఒకరి కళ్ళలోకి ఒకరం చూచుకుంటూ, మాటా పలుకూ లేకుండానే, ప్రయా ణం ముగిసిందని తెలుసుకొంటాం. కానీ ఈరోజు, దర్శ నీయమైన ఒక ప్రదేశం వైపు సాగే ఒక యాత్రికుని ప్రయాణగాథని మాత్రమే మనం పంచుకోగలం.

* * *

జిల్లెళ్ళమూడి చూడదగిన ప్రదేశమని మొదట్లో నాకు తెలీదు. నాకు ముందుగా జిల్లెళ్ళమూడి పోవాలనే ఆకర్షణ నిరాసక్తతతో, అర్ధమనస్కంగా ప్రారంభమయింది మనజీవితాల్లో నిజంగా ప్రధానమైన సంఘటనలు ఎలా జరుగుతాయో అదే రీతిలో, వైవిధ్యంలేని శిలాసదృశమైన తీరమైదానాలలో బురదతో కూడిన ఒక అనామక గ్రామా

నికి నా ప్రయాణం సాగుతున్న సమయంలో, అది అంత ప్రధానమైందని గానీ, ప్రయోజనకరమైందని గానీ నాకు అనిపించలేదు. ముక్కును నేలకతికించి సాగిపోయే జాగిలం మున్ముందు ఏమి పొంచి ఉందో సూచనమాత్రంగానైనా గ్రహించలేదు.

అమ్మతో నా ప్రథమ సమావేశం నాకింకా స్పష్టంగా గుర్తుంది. భారతదేశంలో అపరాహ్ణపు వేడిమి, వెలుతురుల నుండి, మెత్తనైన పెద్ద పరుపు మీద మఠంవేసుకొని అమ్మ కూర్చొని ఉన్న అత్యల్ప కాంతితో వాతానుకూలమైన (ఎయిర్ కండిషన్డ్) గదిలోనికి నడుస్తున్నప్పుడు ఆత్మ స్పృహతో కూడిన అసౌకర్య భావనకెంతగా లోనయ్యానో నాకు బాగా గుర్తు. నేనెందుకున్నట్లిక్కడ? నేను ఏంకోరి ఒక నర్సింగ్‌హోంలో నిస్సందేహంగా ఏదో తీవ్రమైన అనారోగ్యంతో బాధపడుతున్న ఈమె విశ్రాంతిని భంగపరచడానికి వచ్చాను? నేను సాష్టాంగపడాలా? అమ్మ నాకలవరపాటు గమనిస్తుందా?

మొట్టమొదటి నుంచీ అమ్మను చూట్టానికి రావడంలోని నా ఉద్దేశంపై నాకు అంత స్పష్టమైన అవగాహన లేదు. వేరే ఆశ్రమంలో ఉంటూ, అచ్చటి పవిత్ర వ్యక్తిని నా ఆధ్యాత్మిక మార్గదర్శిగా భావిస్తున్న తరుణంలో అమ్మ గురించి మొటమొదటి సారిగా విన్నాను. నేనెప్పుడూ వేరే

ప్రదేశాన్ని సందర్శించాలని కోరుకోలేదు. అసలు ఆ ఆలో చనే స్వామిద్రోహానికీ, బలహీనతకూ సంకేతంగా భావింప బడి ఉండేది.

స్థానికంగా ఉన్న టీ కొట్టువద్ద నా భారతీయ మిత్రునితో నేను కబుర్లు చెప్పుకొంటున్నప్పుడు, అంతకు ముందే ఒకసారి జిల్లెళ్ళమూడిని చూచిన అతడు అమ్మగురించి నాకు కొన్ని విషయాలు చెప్పాడు. ఎలా అమ్మ తానేమీ తినకుండా, అందరికీ తినిపించడంలో ఆనందం పొందుతుందో, తన ఆశ్రమంలో ఎలా కులవర్ణ వివక్షత లేకుండా అందరికీ, 'అందరిల్లు' (House of All) అన్న పేరుకు తగ్గట్టు, ఆశ్రమం అనిపించేటట్టు కాకుండా నిజానికి తన భక్తుల యిల్లు అనిపించేలా ఉచిత భోజన వసతులు కల్పిస్తుందో చెప్పాడు. ఎక్కువ సేపు అమ్మ ఎంతటి మాతృమూర్తో, ఎంతటి కరుణామయో, ఆమె ఎవరినైనా ఎలా ఆదరిస్తుందో, తన అతిథిలా కాకుండా తన సంతతిలా ఎలా చూసుకొంటుందో వివరించాడు. నా మిత్రుడు దేవేంద్ర కవి హృదయం కలవాడు కావడం వల్ల, ఆధ్యాత్మిక జీవితానికి సంబంధించిన శాశ్వత సత్యాలను వ్యావహారిక భాషలో నైనప్పటికీ అనర్గళధారతో కూడిన తెలుగులో పట్టి బంధించగల అమ్మ అద్భుత సామర్థ్యాన్ని గురించి గొప్పగా వివరించాడు. తనకు నచ్చిన కొన్ని సూక్తుల్ని అతడు

ఇంగ్లీషులోకి అనువదించి వినిపించినప్పుడు, అందులో అతను చెప్పిన భాషాభావాల పరిపూర్ణత కంటే ఒక రీతిలో ఇంగ్లీషులో ధ్వనించిన తెలుగు శ్లేషాత్మక వాక్యాల తీరు నన్ను ముగ్ధుణ్ణి చేయుటం నాకు బాగా గుర్తు. వాస్తవానికి, అతనిలో ఎంతో భక్తి, ఉత్సాహం కనిపిస్తున్నప్పటికీ, అతను చెప్పిందేదీ నన్నంతగా ఆకర్షించలేదు. తన రూమ్‌కి నన్ను తీసుకువెళ్ళి అమ్మ ఫోటో నాకు చూపించినప్పుడు, ఆమె గుండ్రని, ఆకార నియతి లేని శరీర వైఖరి ఒక మహాయోగినిని తలపించేటంత విశేషమైనదిగా నాకు స్ఫురించలేదు. అమ్మ పెట్టుకున్న మెరిసే కిరీటమూ, చేత ధరించిన త్రిశూలమూ, భయభక్తుల్ని రేకెత్తించడం మాట అటుంచి, స్వల్పంగా ఆమెను పరిహాసాస్పదం చేసినట్లు పాశ్చాత్యుణ్ణైన నా విరసమైన కళ్ళకు పొడగట్టింది.

అయినప్పటికీ, జిల్లెళ్ళమూడి చేరుకోవడానికి అవసరమైన సూచనల్ని అతను చెప్పగా వ్రాసుకొన్నాను. ఎందుకంటే నేనిప్పుడుంటున్న అంతర్జాతీయ ఖ్యాతివహించిన గొప్ప ఆశ్రమంలోని సాంఘిక కేళీవిలాసాలనుండి దృష్టి మరల్చి, కొన్ని రోజులపాటు ప్రశాంతంగా విశ్రాంతి తీసుకోవటానికి తగిన ఆహ్లాదకర ప్రదేశమైనా అది కనీసం కాకపోతుందా అని నా భావన. కానీ, ఆ తరువాత, ఒక చిన్న వినోద యాత్రని సుసాధ్యం చేసే విధంగా, మాసమాజ కార్య

కలాపాల్లో అంతరాయం ఏర్పడినంతవరకూ దానిగురించి నేను పట్టించుకోలేదు. అయితే అంతరాయం ఏర్పడగానే, రెండువందలమైళ్ళ దూరంకూడా లేని జిల్లెళ్ళమూడిని సహజంగా ఎంచుకున్నాను. అందువల్ల గొప్పగా ఆశలేమీ పెట్టుకోకుండా, కేవలం ప్రదేశంలో మార్పుకోసం బయలు దేరాను.

కేవలం చెక్కబల్లలాంటి అప్పర్ బెర్త్‌మీద అసౌకర్యంగా పడుకొని ఒక రాత్రంతా రైలులో ప్రయాణం చేసిన మీదట బాపట్ల అనే పట్నం చేరుకున్నాను. సున్నం కొట్టిన నిమ్నగృహాలతో, అక్కడక్కడా శిథిలమౌతున్న ప్రభుత్వ భవనాలతో, అసంగతంగా ఉన్న గతకాల వలస రాజ్యావశేషాలతో కూడిన తాలూకా కేంద్రమది. మాతృశ్రీ ప్రెస్‌వైపు నేను నడుస్తుండగా ఆ ప్రభాతవేళ ప్రేతకళతో కూడిన తెల్లని పొగమంచులో ఆ పట్నం నిర్జనంగా ఉన్నట్లనిపించింది. మాతృశ్రీ ప్రెస్ దగ్గరే జిల్లెళ్ళమూడి వెళ్ళ రావటానికి వ్యాన్‌గా మార్చబడ్డ రెండవ ప్రపంచ యుద్ధ కాలంనాటి జపనీయుల సైనిక వాహనం దొరుకుతుందని దేవేంద్ర నాకు చెప్పాడు.

చొక్కాలు లేకుండా, బక్కచిక్కిన శరీరాలతో, సీసం అచ్చులు పోసిన పెద్దపెద్ద చెక్కట్రేల ముందున్న కంపోజర్లతో, పురాతనంగా కనిపించే బూజుపట్టిన ప్రింటింగ్ షాప్

లోకి అడుగు పెడుతూనే జిల్లెళ్ళమూడి వెళ్ళేవ్యాన్ ఎప్పుడు బయలుదేరుతుందని అక్కడ ఉన్న వయసుపైబడిన మేనేజర్‌ని అడిగాను.

"జిల్లెళ్ళమూడా ?" అని అనుమానంగా అతడడిగాడు. "ఇప్పుడక్కడికి పోవడంవల్ల ప్రయోజనం లేదు. అక్కడెవరూలేరు. అమ్మ ఆరోగ్యం బాగుండటంలేదు. ఆమె కొన్ని మాసాలుగా ఒక నర్సింగ్‌హోమ్‌లో ఉంటున్నది" అని చెప్పాడు.

చిల్లిబడ్డ బెలూన్‌లాగ నాఉత్సాహమంతా తక్షణమే అణిగిపోయినట్లనిపించింది. ధూళిధూసరితమైన ఈ మారుమూల గ్రామానికి యింతశ్రమపడి అనవసరంగా వచ్చాను: తగిన శాస్తే జరిగిందనుకున్నాను. ముందుగా అసలు నేనిక్కడకు రావాల్సిన పనేలేదు: కేవలం ఉండబట్టలేక (ఒకచోట నిలకడలేక) వచ్చాను, యిప్పుడు చిక్కుకుపోయాను. దేనైనా నష్టాన్నుంచి కాపాడ్డం సాధ్యమా ? "బహుశా నేను నర్సింగ్ హోమ్ దగ్గరే అమ్మ ఆశీస్సులు పొందవచ్చునేమో" అని చివరి ప్రయత్నంగా అనుకున్నాను. నాకు నిజంగా అక్కడకు వెళ్ళాలనే కోరిక ఉందాలేదా అనే అంశాన్ని పరిగణించే అవకాశం కలగక ముందే, "అమ్మ ఎక్కడ ఉందో అక్కడికి పోయి నేనామెను చూడవచ్చా?" అని మేనేజర్‌ను నేనడగడం గమనించాను. అతనొక్కక్షణం తటపటాయిం

చాడు: వెంటనే, అంతరాయం లేకుండా అమ్మ కోలుకొనేందుకుగాను అమ్మ ఆచూకీ ఎవరికీ తెలియపరచకూడదని తనకు ఆదేశాలున్నాయని అన్నాడు. అంతా విధివ్రాత అని భావించే అచ్చపు భారతీయుడి లాగానే, "సరే: ఈ సమావేశం జరగాలని నిర్ణయింపబడిలేదు" అని నన్ను నేను ఓదార్చుకొని, బయలుదేరబోయేంతలోనే మేనేజర్ మనసు మార్చుకున్నాడు. దూరదేశం నుండి యింతదూరం వచ్చారు కనుక మీ విషయంలో బహుశా సడలింపు చూపవచ్చని అన్నాడు. విదేశీయులపట్ల భారతీయులు చూపే ఆతిథ్య చిహ్నమది. ఇలాంటి ఆతిథ్యమే భారతదేశంలో నాకు అనేక సార్లు అనుభవంలోకి వచ్చింది. కాలాతీతమైనా బ్యాంకుల్లో ట్రావెలర్స్ చెక్కులు మార్చిపెట్టడం, పూర్తిగా నిండిపోయిన రైళ్ళలో బెర్తులు దొరకడం యిలాంటివే. ఆయన యిచ్చిన నర్సింగ్ హోమ్ ఎడ్రస్ తీసుకొని, ఒక చిన్న పుస్తకం, అల్ప పరిజ్ఞానంతో ముద్రింపబడ్డ వర్ణచిత్రాన్నీ కొనుక్కున్నాను.

మేనేజర్ చేసిన సహాయానికి ధన్యవాదాలు తెలుపుకొని, మొదట్లో అమ్మను చూడాలనే కోరిక నాకంత బలీయంగా లేదనే విషయాన్ని జ్ఞప్తి తెచ్చుకొని, కొంత సంకోచంతోనే ఊళ్లోకి బయలుదేరాను. నర్సింగ్‌హోమ్ లాంటి స్థలంలో, సాధారణ పరిస్థితుల కంటే భిన్నమైన పరిస్థితుల్లో అమ్మను చూడగలనో లేదో అనే అదృష్టం మీద ఆధారపడి,

పుట్టి బహుశా ఫలితంలేని సుదూరమైన రైలు ప్రయాణం చెయ్యాలనే కోరిక నాకు నిజంగా ఉందా ? ఇప్పటికే చాలా దూరం వచ్చేశానన్న వాస్తవం, విజయం వల్ల సంక్రమించే ప్రయోజనం అనుమానాస్పదంగా తోచినప్పటికీ అపజయా న్నంగీకరించడానికి గల అయిష్టతా కలసి, చివరకి ఈ ప్రయత్నానికి స్వస్తి చెప్పేద్దామనే ఆవేశాన్ని జయించాయి. రోడ్డు దాటి, రైల్వేస్టేషన్‌కుపోయి నెల్లూరులో డా॥ యస్వీ సుబ్బారావు గారి క్లినిక్‌లో అమ్మ ఉంటున్నదని తెలియడం వల్ల నెల్లూరు పోవటానికి దక్షిణ దిశగా పోయే రైలు ఎక్కాను.

* * *

ఎడమెడంగా వెదజల్లబడిన హరితద్వీపాల్లాంటి గ్రామాలు. అక్కడక్కడా కనిపించే గాలికి ఊగే తాటిచెట్ల బారులు మినహా శూన్యంగా ఉన్న సువిశాల భూభాగం గుండా రైలు శబ్దంచేస్తూ వేగంగా పరిగెడుతుండగా, నేను బాపట్ల ప్రెస్‌లో కొన్న చిన్న పుస్తకాన్ని తెరిచాను. ఈ కోవకు చెందిన వర్తమాన సాహిత్య ప్రమాణాలతో పోలిస్తే, అందులోని రచన చాలా నైపుణ్యంతో చేయబడింది. సులభ గంభీరమూ, సరసమూ అయిన శ్రుతిపురాణ విహితమైన శైలిలో దర్శనాలూ, మహిమలగురించి ధర్మకావ్య సంబంధ మైన కథలు అందులో రాయబడి ఉన్నాయి. ఎవరు అన్నం

తినటానికి నిరాకరించారో, ఎవరు సత్యం గురించి, దైవం గురించి మతగురువులైన తన పెద్దలకు ఉపన్యాసమిచ్చారో, ఎవరు తన ఉయ్యాలలో అవలీలగా సమాధిగతమయ్యారో, మిగతా పిల్లలు పొందికగా ఒక వాక్యం గూడా పలకలేని వయస్సులో ఎవరు తానప్పటికీ అందరికీ తానే అమ్మనని ప్రకటించారో ఆ శిశువు గురించిన కథలవి. పుస్తకానికి వెనకవైపున ఉన్న అమ్మ మాటలు నిగూఢంగానూ విచిత్రంగా కదిలించేవిగానూ ఉన్నాయి– "ఎప్పుడో మిమ్మల్ని కనిపెంచాను, ఇప్పుడు కనిపించాను". "నా కొలత ఎవరికీ తెలియదు, అందరి కొలతనూ నేనే". "నన్ను మరుగుపరుచుకొనేందుకో తెర, నా మారువేషాన్ని ప్రదర్శించేందుకు కింకోతెర, ఎప్పుడూ తెరవెనుకతెర ఉంటూనే ఉంది. మాటలతోగాని, పెన్నిధితోగాని ఎవరూ తెరను తొలగించి జొరబడలేరు."

పై వాక్యాల సారాంశం సాహసరహస్య ప్రవృత్తికి హత్తుకొనేటట్లుంది. వడిగా దాటిపోతున్న ఉష్ణదేశాల వెలుగూ భూభాగ విస్తృతీ అమ్మమాటల వ్యాపకత్వాన్ని ప్రతిధ్వనింప జేస్తున్నాయి. అనిర్వచనీయమై నప్పటికీ అద్భుతమైన జాడలో, ఐహిక బంధ విముక్తి పొంది సంతృప్తుడై గంభీరుడై సాగే యాత్రికునిలా విచిత్రంగా ఉప్పొంగిపోయాను.

నెల్లూరికి అభిముఖంగా రైలు వేగంగా పరిగెడుతుండగా, నేను పదేపదే ఆ చిన్న వర్ణచిత్రం వంక చూడటం గమనించాను. ఒక రకంగా నిరాడంబరంగా, స్పష్టమైన నిర్విశేషతతో కూడిన ఆ ఫొటోలో తన ఎడమ చేతి వ్రేళ్ళ మీద గడ్డాన్ని ఆన్చి, సూటిగా కెమేరా వంక చూస్తున్న అమ్మ రూపం ఉంది. తన మనోహరమైన గుండ్రని వదనం ప్రశాంతంగా, భావరహితంగా, యించుమించు శూన్యంగా కన్పిస్తుంది. కానీ అందులో బలీయమైందేదో ఉంది— ఆమె కళ్ళలోని ఒక ప్రత్యేక లక్షణం దాని వంక పదేపదే అసంకల్పితంగా చూసేట్టు చేసింది. ఈ ప్రయాణం ముగిసేలోగా మొనాలిసా చిత్రం గూడా, ఈ మొరటైన చిన్న వర్ణ చిత్రమంతగా, అంతుచిక్కనిదిగానూ, గంభీర భావధారా సిద్ధమైందిగానూ కనపడేదికాదేమో! నేను దాన్ని పరిశీలనగా చూస్తున్నప్పుడు, ఆ చిత్రంలోంచి ఒక సజీవమూర్తి తిరిగి చూస్తున్నట్లనిపించింది. నేనామెను త్వరలో చూడబోతున్నట్లు ఇప్పటికే అమ్మకు తెలుసునా? ఆ చిన్న పుస్తకంలో ఉన్న అసాధారణ సూక్తుల్లోని ఒక దానివైపు ఆలోచనని మళ్ళించాను. "నేనెవరిని చూడనో వాళ్ళెవరూ యిక్కడకు రారు." "నన్నిప్పుడు చూస్తున్నావా? అమ్మా! అని మనస్సులోనే ఆ చిత్రాన్ని ప్రశ్నించాను. ఆ ప్రశాంత లోచనాలలో దాన్ని ధృవీకరించడానికి పడే తపన కనిపించింది.

అంతలోనే రైలు పెన్నానది మీదుగా పెద్ద శబ్దం చేస్తూ సాగిపోయింది. మరికొద్ది క్షణాల్లో మేము నెల్లూరు రైల్వేస్టేషన్ చేరుకుంటున్నాం. చేరినాక సామాను వీపుకు తగిలించుకొని, రిక్షావాలాల్ని దాటి, అస్తవ్యస్తంగా బండ్లతోను, సైకిళ్ళతో నిండిపోయి, తమ వనవిహితమైన విశ్రాంతిపై తమను ఒరుసుకొని సుడులు తిరుగుతూ ప్రవహించే కార్యకలాపాల తరంగాలు ఏమాత్రం ప్రభావం చూపలేవనే భావాతీత విశ్వాసం ప్రపంచాని కంతటికీ కనిపించేటట్లు బాగా జనసమూహాలతో కూడిన సందుల మధ్య తమకు సహజమైన రీతిలో అలసిపడుకొన్న ఆవులతో సమ్మర్దంగా ఉన్న ఆ నగరంలో నేను తాత్కాలికంగా లీనమై పోతూ నడక సాగించాను. జీవం సంపూర్ణంగా తొణికిసలాడే ఈ సందుల గుండా నడవడం ఒక విధంగా హృదయాన్ని కదిలిస్తే, పరిగెత్తే రైలులోంచి గ్రామసీమల ప్రశాంతతా విస్తృతిని తిలకించటం వేరే విధంగా హృదయాన్ని కదిలించింది. గ్రామసీమ శాశ్వతపరమాత్మ ధ్యానముద్రాబద్ధుడైన మహావిష్ణువైతే, నగరం ఆవేశ పూరితమైన సజీవ నృత్యం చేసే నటరాజైన శివుడు. లేమి విషయం ప్రక్కన ఉంచి, వరిపొలాల మధ్యనున్న ఈ మధ్య తరగతి నగరానికి గల ఒక విధమైన నవ్యత, చైతన్యము, చక్కటిఛాయ, దీనికంటే ఎక్కువ కఠోరసాఫల్యత గల దీనివంటి పాశ్చాత్య దేశ నగరాల్లో కనిపించదు. భారత దేశంలో ఉపరితలం

మీదే జీవమంతా ప్రస్ఫుటంగా ప్రవహిస్తుంది. భారతదేశ నగరం చైతన్య గంగా స్రవంతి; జన సమ్మర్దం గల దాని నగర వీధుల్లో నడవటం అనివార్యంగా దాని ప్రవాహంలో కలిసిపోవడమే, అంతేకాకుండా సజీవ జలాలతో పొందిన తాదాత్మ్యతలోనూ, అజ్ఞాతస్థితిలోను సంరక్షణ పొందే నీటి బుడగలా దానిలో అంతర్భాగం కావటమే! పండ్లదుకాణా దారుల వంక ఆత్రంగా చూస్తూ దొరికితే మీదబడి పళ్ళను దోచుకోవటానికి తగిన అవకాశం కోసం నిరీక్షిస్తూ కోతులు హైటెన్షన్ వైర్లమీద వీపులువంచి కిచకిచలాడుతూ తూగుతున్నాయి సైకిల్ రిక్షాల చిఱుగంటల మ్రోతల్నీ, పనికి మాలిన సామానులను మోసుకుపోయే బండ్ల గుడుగుడు శబ్దాల్నీ. బేరసారాలుచేసే కంఠస్వరాల్నీ ముంచి వేస్తూ ఒక వీధికి మూలగా నున్న దేవాలయంలో ఒక వ్యాపార భక్తుడు తన మొర నాలకించమని దేవతల్ని మేల్కొలుపుతూ బలంగా గంట మ్రోగిస్తున్నాడు. వీటన్నిటిమీదా తేలియాడుతూ, ముస్లింల ప్రార్థనా సమావేశ కాలాన్ని సూచిస్తూ 'మజ్జన్' పాడే గీతంలోని గంభీర, గాంధర్వ నాదతరంగాలు వస్తున్నాయి. సాయంకాల మయింది. హోటల్ చూచుకోవాల్సిన సమయమాసన్నమైంది. హోటళ్ళ సైన్ బోర్డుల కోసం భవంతుల్ని పరీక్షగా చూశాను. ఒక ఫోటోగ్రాఫర్ షాపులో ప్రదర్శింపబడుతూ మోకాళ్ళ వరకు నిండుగా వ్రేలాడే పూలహారాలతో ఉన్న ఒక స్త్రీ మూర్తి

ఫోటో వద్ద నాదృష్టి నిలిచిపోయింది. దగ్గరకు వెళ్తూనే నా అనుమానాలు ధృవపడ్డాయి. అది ఇంకోసారి నావంక చూస్తున్న జిల్లెళ్ళమూడి అమ్మది. ఇది శుభ శకునమని నిర్ణయించుకున్నాను. "మొట్టమొదట కనిపించిన లాడ్జిలో దిగి, భోజనంచేసి, గదికి చేరుకొని రేపు ఉదయమే డా॥ సుబ్బారావుగారి క్లినిక్‌ని వెదకాలి" అని.

తరువాతి ఉదయం సేదదీరి, బయలుదేరాలనే ఉత్సాహంతో నిద్రలేచి నాపరుపుకు తలదిక్కుగా ఉన్న స్టూల్‌పై నేనుంచిన అమ్మ చిత్రాన్ని నిదానంగా చూసాను. అది యింతకు ముందెంత నిగూఢంగా కన్పించిందో అంతే నిగూఢంగా, సంపూర్ణ దివ్యాభయ ప్రదంగా కన్పించింది. వెల్లికిలా పడుకొని నాలోనేను ప్రశాంతంగా పవిత్రమైన ఓంకారాన్ని జపించడం మొదలు పెట్టాను. ఈ రోజు ఏం వ్రాసి పెట్టి ఉందో ? అని ఆలోచిస్తూ పరధ్యానంగా ప్రణవోచ్చారణ చేస్తుండగా, ఒక సూక్ష్మప్రకంపనం - ఒకరకమైన అంతర్నాదం - ప్రభవించి, ప్రతి శరీరకణమూ దానితో నిండిపోయి నట్లనిపించినంతవరకూ దాని తీవ్రత వడిగా పెరగజొచ్చింది. ఆ క్షణంలో ఒక పరిణామం సంభవించింది. ఆనాదంవల్ల శరీరం విచ్ఛిత్తి పొందిందా అన్నట్లు, దానిపై స్మారకాన్ని కోల్పోయాను. దాంతో పాటే చైతన్యస్వభావంలో ఒక మార్పు వచ్చింది. ఒక అపరిచిత సీమలోకి

మనస్సు లాగబడిన భావన. ఆలోచనలు, దృశ్యాలు అదృశ్యమైనాయి. త్రుటికాలం పాటు, సాటిలేని పరిపూర్ణ తేజోమయ స్వేచ్ఛాభావన కలిగింది. ఏం జరిగిందో తెలుసుకొనే లోగా హోటల్‌రూమ్‌లో మళ్ళీ నేను వెల్లకిలా పడుకొని ఉన్నాను. ఇదంతా వడివడిగా జరిగిపోయింది. దాని వైచిత్రితో తలముస్కలై నిటారుగా కూర్చున్నాను. ఎన్నోసార్లు దీర్ఘకాలంపాటు, వ్యాకులపాటుతో ధ్యానంలో కూర్చున్నాను గాని యిటువంటిది యింతకుముందెప్పుడూ జరగలేదు. వాచామ గోచరమైన ఆత్మిక పవనాల్లో కొట్టుకుపోయినట్లు, మళ్ళీ అంతే వేగంగా తిరిగి నేనలవాటుపడిపోయిన నాశరీరంలోకి పడవేయబడినట్లూ అనిపించింది. నెమ్మదిగా విడిపోయే పొగమంచులా తారాడే ఒక సుస్నితమైన అలౌకికానందానుభూతితో, నేను మంచం అంచున చాలాసేపు పారవశ్యంతో కూర్చొని ఉండిపోయాను.

ఇదంతా గొప్ప దిగ్భ్రాంతికరంగా ఉంది. దీనిని సమీపిస్తున్న అమ్మ దర్శనంతో అన్వయించాలని నాకు తట్టనేలేదు. జాగిలం తీరిగ్గా జాడనుండి ముట్టెనెత్తి, ఆ విచిత్రవాయువు స్వాగతార్థమై ప్రసరించే అమ్మ ఉచ్ఛ్వాస నిశ్వాసాలని గ్రహించినప్పుడుగాని ఆ సంబంధ మేర్పడదు.

మహిమలు ప్రదర్శించే ప్రసిద్ధ యోగి శ్రీ షిర్డీ సాయిబాబా, తన భక్తులు సూత్రబద్ధమైన కాళ్ళుగల పక్షుల

వంటి వారనీ, తనను ఎరుకపరచుకొనే సరిఅయిన సమయు మాసన్నమైనప్పుడు, తన చేతిలో ఉన్న ఆ సూత్రాన్నాధారంగా తనవైపు వారిని లాక్కుంటాడనీ చెప్పినట్లు చెప్తారు. స్పష్టంగా నేను ఈడ్చబడే మార్గంలోనే ఉన్నాను. కానీ చిత్రమేమిటంటే, ఈడ్చబడుతున్న పక్షి మాత్రం తాను స్వంచ్ఛందంగానే సాగుతున్నాననుకొంటుంది.

ఏది ఏమైనా, ఇంకా సుఖమయంగానే ఉన్న ప్రభాత సంధ్యాకాంతిలో, డాక్టర్ సుబ్బారావుగారి క్లినిక్‌ను వెదుక్కుంటూ నేను బయలుదేరినప్పుడు నాకుకలిగిన అభిప్రాయం మాత్రం అదే. హోటల్ మేనేజర్ యిచ్చిన సూచన లాధారంగా నేను త్వరలోనే నాగమ్యాన్ని చేరుకున్నాను– అది చెట్ల వరుసలతో నివాసగృహాలున్న ప్రశాంత వీథిలో ఒక ఏకాంతగృహం. అక్కడ యిటువంటి పరిస్థితుల్లో ఒక విదేశీయుని వదనభూతం సహజంగా కలగజేసే విస్మయం కనబడలేదు సరికదా నేను ద్వారం దగ్గర సాదరంగా పలకరింపబడ్డాను. నేను రావటానికి గల ఉద్దేశ్యాన్ని వివరించగానే, నివాసగృహమూ, క్లినిక్కూ కలసి ఉన్న ఆయింటి వెనుక భాగంలో ఉన్న రోగుల గదుల్లో ఒక వైపు తీసుకెళ్ళారు. అక్కడ ఒక గదిలో నాకంటే ముందే వెళ్ళి చక్కగా సర్దుకుకూర్చున్న నలుగురు విదేశీయులు ఎదురయ్యేసరికి దిగ్భ్రాంతి చెందడం నావంతయింది. సంప్రదాయం ప్రకారం పరస్పర పరిచయాలై

నాక, అక్కడ ఉన్న యువకులు బ్రిటీష్‌వారనీ, గత కొన్ని సంవత్సరాలుగా జిల్లెళ్ళమూడిలో అమ్మతోపాటు ఉంటున్నా రనీ తెలుసుకున్నాను. అమ్మ క్లినిక్‌కు బయలుదేరినప్పుడు వారినికూడా వెంటరమ్మని పిలిచారు. అప్పుడప్పుడూ అనుకో కుండా అమ్మ ఆరోగ్యపరిస్థితి ననుసరించి ఆమెగదిలో ఆమెతోపాటు కూర్చునే అవకాశ మేర్పడుతుందట. నా అదృష్టవశాత్తు చీకటిపడేలోగానే అమ్మ దర్శనానికి మమ్మల్ని పిలిచారు.

చివరిక్షణంలోకూడా, నామనసంతా మనస్థైర్యాన్ని దెబ్బతీసే అపోహలతో నిండిపోయింది. పాత అనుమానాలు, స్వామిద్రోహచింతన, రహస్యభంగభయం, అన్నీ కలసి చెలరేగిన తేనెటీగలదండులా నన్ను చుట్టుముట్టాయి. మసగ్గా ఉన్న కిటికీలులేని గదిలోనికి మమ్మల్ని తీసుకు వెళ్తున్నప్పుడు తప్పించుకు పారిపోదామనే తీవ్రభావన కలిగింది. కానీ తప్పించుకోవటం సాధ్యం కాలేదు. బాధాకర మైన అసౌకర్యభావనతో లోనికి అడుగుపెట్టాను.

అమ్మ మొట్టమొదట ఆలోచనా నిమగ్నమై ఒక రకంగా ఎక్కడో ఉన్నట్టు కనిపించింది. అయిదు అడుగుల కంటె కొంచెం తక్కువ ఎత్తుగల ఆమె ఆశ్చర్యకర మైన స్వరూపం సహజగాంభీర్యంతో, గొప్ప నిశ్చలతతో నిటారుగా ఉంది. ఆమె కాస్త బలహీనంగాను, శారీరకంగా

బాధపడుతున్నట్లు కనిపించింది. కానీ నిస్సంగతా ముద్ర కొట్టవచ్చినట్లుంది. మేము ఒకరి తర్వాత ఒకరం నమస్కరిస్తుండగా, అమ్మగమనించి నట్లేలేదు. ఎక్కడా కేంద్రీకృతం కాని ఆమె చూపులు ప్రశాంతంగా ఎక్కడో దూరంగా ప్రసరిస్తున్నట్లు కన్పించాయి. ఆమె పక్కకు కొన్ని అడుగుల ముందు నేల మీద నా స్థానంలో నేను కూర్చుంటున్నప్పుడు, అమ్మ కొద్దిసేపు నావంక తదేకంగా చూసింది. ఆమె సౌమ్యమైన కళ్ళు మార్దవంగా ప్రకాశించాయి : ఆమె చూపులో ఒక ప్రశాంత తీవ్రత, నిష్కాపట్యము తప్ప ఆసక్తిగానీ, విచక్షణాశీలతగానీ లేదు. అన్నింటినీ మించి. చమత్కార పూర్వకమైన ఆమె భావముద్రలో ఏ అనిర్వచనీయ లక్షణం ఆ చిన్న వర్ణ చిత్రంలో ఉందో, అదే యిక్కడ కూడా ఉంది. నాలోని ఏదో సడలింపునీ, శరణాగతినీ కాగోరుతున్నది. కానీ దాంతో పాటే నామానసికస్థాయి యొక్క అపరిపక్వతా, అపాత్రతలపట్ల ఒక సౌఖ్యరహిత స్పృహా, కరుణాత్మకమైనవై నా తీక్షణమైన అమ్మ చూపు నుండి పారిపోవాలనే కాంక్షా నాకు కలిగాయి. అమ్మ వెంటనే నా యీ స్థితిని గమనించినట్లుంది. ఎందుకంటే ఆమె తలెత్తి కొన్ని క్షణాలపాటు నా వంక విచిత్రంగా చూసి కొన్ని ప్రశ్నలడగడం ప్రారంభించింది. మా యిద్దరిమధ్యా డా॥ సుబ్బారావుగారు అనువాదకునిగా ఉండగా, అమ్మ మృదువుగా, ఆప్యాయంగా నేనెక్కడి నుండి వస్తున్నదీ

ఎన్నాళ్ళుగా భారతదేశంలో ఉంటున్నదీ. ఏ ఏ ఆశ్రమాలు చూసినదీ అడిగింది. కొత్తదనం పోవడానికది తోడ్పడింది. నా గురించి అంతా చెప్తుండగా, ప్రారంభంలో నాలో ఉండే బెరుకు నెమ్మదిగా మాయమై పోయింది.

డా॥ సుబ్బారావు, పాశ్చాత్యులేకాకుండా, కొద్దిమంది డాక్టరుగారి కుటుంబసభ్యులూ, ఆయన సహచరులూ, ఒక యువతి ఆ గదిలో ఉన్నారు. ఆయువతి వసుంధర అనీ, అమ్మనెప్పుడూ ఎడబాయకుండా ఆమె సేవకంకితమై పోయిన పరిచారిక అనీ, తెలుసుకున్నాను. నిజానికప్పుడు అక్కడున్న వాళ్ళెవరో నాకు తెలియదు, కానీ అమ్మ వారితో మాట్లాడే తీరునుబట్టీ, వాళ్ళమధ్య జరిగే పరస్పర సంభాషణ లోని ఆత్మీయతనుబట్టీ, వాళ్ళు అమ్మకు ప్రత్యేకమైన అంతరంగిక సహచరులై యుండితీరాలని అనుకున్నాను. తరువాత తరువాత అది నిజంగాదనీ, అమ్మ అందర్నీ అదే మాతృత్వపు చనువుతో సంభావిస్తుందనీ, ఎప్పుడో ఒకసారి వచ్చే అగంతకులు కూడా ఆమె తమకుటుంబ సభ్యురాలా అనిపించేటట్లు సంకోచమేమీలేకుండా మెలగుతారనీ నాకు తెలిసింది. కానీ అప్పటికి మాత్రం నాకు అత్యంతాప్త వర్గాన్ని చూస్తున్నాననే ఆధిక్యతా భావన కలిగింది. నిరాటంకంగా హావభావ చేష్టలు ప్రదర్శిస్తూ అమ్మ హాయిగా నవ్వుతూఉంది. ఒక్కొసారి సాభిప్రాయంగా ఆగుతూ,

ఒక్కోసారి రాళ్ళమీదుగా ప్రవహించే సెలయేరులా లయ బద్ధంగా సాగుతూ, అమ్మసంభాషణ అనర్గళధారగా సాగిపో తుంది. అమ్మవాడే ధారాళమైన శబ్ద ప్రయోగాల గురించి దేవేంద్ర చెప్పినమాట గుర్తుకువచ్చింది. ఆమె మాట్లాడేది అర్థమైతే బాగుండేదికదా అనుకున్నాను. అమ్మకు భాషా ప్రావీణ్యం ఉందని గ్రహించడానికి ఆమె మాట్లాడుతున్న పుడు వింటే చాలు, వినేవారు ఆమె మాటలను స్వాయత్తం చేసుకొనేతీరు గమనిస్తేచాలు. అమ్మ ఏం మాట్లాడుతుందో కాని, ఆమె మాట్లాడేది సాధారణ ప్రసంగంలా కాకుండా, కవిత్వానికీ, కళాత్మక నాటకీయ సంభాషణకీ దగ్గరగా సహజసౌందర్యంతో అత్యంత రమణీయంగా ఉంది. కానీ అది ఎంతో అప్రయత్న పూర్వకంగా, నిష్కల్మషాత్మ కంగా, ఆనందమయంగా సాగిపోతుంది. ఆమెను చూడ టంలోనే ఆనందముంది. ఇప్పుడు అమ్మ నీరసంగా, అనా రోగ్యంగా ఉందన్నభావనే పూర్తిగా మాయమయింది. నిజానికి అమ్మ ఏబయ్యోపడి చివరనున్న స్త్రీగా ఏమా త్రమూ కనిపించడం లేదు. తన సన్నిహిత స్నేహితులతో రహస్యాలు పంచుకొంటున్న వెడల్పుకళ్ళ పసిపిల్లలో కనిపించే స్వచ్ఛమైన ప్రతిఫలనశీలతా, నిర్మలమైన అమాయకత్వం అమ్మముఖంలో ఉన్నాయి.

నాకెదురైన యించుమించు అందరు ఆధ్యాత్మిక గురువుల్లోనూ కనిపించే - తామే ఘనులమనే విచిత్ర

పై ఖరికి విరుద్ధంగా అమ్మలో కనిపించే సరళస్వభావమూ, డంభరాహిత్యమూ నన్ను అన్నిటి కంటే మించి ముగ్ధుణ్ణి చేసాయి. వృత్తిపరంగా మఠాధిపతులైన వారిలో కనిపించే తెచ్చిపెట్టుకొన్న గాంభీర్యం గానీ, జ్ఞానులమనే స్వోత్కర్ష గానీ అమ్మలో లేశమాత్రమూ లేవు. అమ్మ తరచూ మనోహరంగా నవ్వుతూ, తెలుగు మాట్లాడే వారితో అందరికీ ఆనందం కలిగేటట్లు జోక్‌లు వేస్తుంటే ఆమె చెప్పింది తెలుసుకోవాలని పదేపదే ఆరాటపడ్డాను.

అయినా స్పష్టమైన ఈ ఉల్లాసానికీ యథేచ్ఛకీ అడుగున నిర్ద్వంద్వమైన లక్ష్యశుద్ధి ఉంది. నిష్ప్రయోజకత ఏమాత్రమూ లేదు. అమ్మ అచంచలమైన సంపూర్ణ శాంతిని విరజిమ్ముతుంది. అమ్మ నవ్వు అదుపు తప్పకుండా స్వేచ్ఛగాను, స్వభావం నిష్కపటమై సేదతీర్చగలిగినంత సరళంగాను, భక్తుల యెడ కనపడే వాత్సల్యం రాగరహితంగా, హృదయాలకు హత్తుకొనేట్లుగాను ఉంటుంది.

అమ్మ వ్యక్తిత్వం పట్ల వినమ్ర భక్తిభావం కలగకుండా ఉండటం అసంభవం. సాగిపోతున్న ప్రతి గాలి తాకిడికీ ఊగుతూ, అచంచలంగా, దృఢంగా భూమిలోనికి పాతుకొని, అందుబాటులో లేనంత ఎత్తున ఉన్న ప్రకాశమానమైన దివ్యమకుటంతో, ఒక వంక సాధారణమైన నేలకి

స్థిరంగా అంటిపెట్టుకొని ఉన్న వేళ్ళతో ఠీవిగా ఉండే తాటి చెట్టును అమ్మ స్ఫురింపజేస్తుంది.

ప్రథమ దర్శనంలోని పులకరింతనూ, దానిలోని అద్భుతాన్నీ వ్యక్తీకరించడం అసాధ్యం. ఇతర సామాన్య వ్యక్తుల్ని పోలిఉన్నా, వారికంటే భిన్నంగానూ, ఉన్నతం గానూ, గంభీరంగానూ, విస్తృతంగానూ ఉన్న ఒకానొక వ్యక్తి యిక్కడ ఉంది. నేను చాలా బలీయంగా గ్రహిం చిన విషయమిది. నాకు తెలుసని మీరనొచ్చు. కాని నాకెలా తెలుసో నాకే తెలియదు. అదంతా ప్రకృతిసిద్ధమైంది. అమ్మ సాన్నిధ్యంలో ఏదో మేలుకొంటుంది. ఏదో కదలిక పొందుతుంది. అది పరమాత్మ గురించి ఒక అస్పష్టమైన దిగులు. ఆభావన గొప్పగా వికసించిన మూర్తి యొక్క ఆకర్షణీయత కంటే, రామణీయకత కంటే, అనుగ్రహం కంటే, ఉన్నతమైంది యిక్కడ ఉందనే విషయాన్ని ప్రతి ఒక్కరూ గ్రహించేటట్లు చేస్తుంది. నిర్ద్వంద్వమైనగుణం, ఒక పరిపూర్ణత అక్కడుంది. అది పైకి విశ్వాసంగానో, నిగ్రహంగానో కనిపించినా, ప్రాపంచిక గుణాలకంటే పూర్తిగా భిన్నమయిందేదో దానిచుట్టూ ఉంది. "ఆశకు అతీతంగా.... భయానికి అతీతంగా.... దృఢచిత్తుడైన యోగి" అనే గీతావాక్యాలు గుర్తొచ్చాయి. ఊరకకూర్చొని చూస్తున్నా, అమ్మ యొక్క సుస్థిర ప్రశాంతతలోని ఒకా

నొక గుణం అంజనంలా మనసుపై పనిచేస్తూనే ఉంది. ఇదంతా గమనిస్తే, యోగి పాదపద్మాల చెంత భక్తుడు ఆశ్రయాన్ని పొందుతాడని హిందూ శాస్త్రాలు ఎందుకు చెప్తాయో అర్థం చేసుకోవటం చాలా తేలిక. ఇక్కడ ప్రతి ఒక్కరూ ఆశ్రయాన్నీ, రక్షణనీ పొందినట్లు భావిస్తారు.

మొదటి సమావేశంలో నాకు కలిగిన ప్రబలమైన అనుభూతి ఏమంటే ఇతరులయెడ అమ్మకుగల అసాధారణమైన అన్యోన్యత. అమ్మకు, తన భక్తులకు (బిడ్డలకు) గల గంభీరమైన తాదాత్మ్యత నేనే జనంలోనూ చూడలేదు. అమ్మ ఎవరితోనైనా శాంతంగా ప్రియంగా సంబోధిస్తున్నప్పుడు అమ్మ వాళ్ళ హృదయంతో నేరుగా బుజ్జగిస్తూ, ధైర్యం చెపుతూ, ఊరడిస్తూ మాట్లాడుతున్నట్లు ఉంటుంది. బాల భాస్కర కాంతికి వికసించే కమలాలవలె ఎందరో తమ తమ బాధలను వెళ్ళబోసుకోవటం మీరు వాస్తవంగా చూడగలరు. పసిపిల్లవలె అమ్మ సహజంగా నవ్వినప్పుడు ప్రతి ఒక్కరూ నవ్వుతారు. నేనుకూడా అంతకన్న ఏమీ చెయ లేక పోయాను. ఎంతో సమయం కాకుండానే అమ్మ పరిహాసాలు అర్థం చేసుకోలేక పోతున్నానే అని విచారపడటం మరుస్తున్నాను. ఏదో రకంగా నేనుకూడా వాళ్ళనుచూసి నవ్వుముఖం పెట్టడం గమనిస్తున్నాను. ఒక కారణంగాని, ఒక వివరణగాని అవసరంలేని సంతోషం. అమ్మనన్ను

సంబోధిస్తూ తెలుగులో వ్యాఖ్యానాలు చేయటం, తాను మాట్లాడేటప్పుడు నా అభిప్రాయంకోసం అప్పుడప్పుడు నావంకకు తిరగటం మొదలుపెట్టింది. ఒక విధంగా ఇదేమీ అసంబద్ధంగా కనుపించలేదు. తాను అందించేది ప్రాథమికంగా ఈ మాటలకు సబంధం లేనిదని. (ఆ మాటలు నేనె లాగూ అర్థం చేసుకోలేనని తెలిసిందే) కేవలం ఆమాటలలో గర్భితమైన ప్రేమనేనని అమ్మ చెపుతున్నట్లు తోస్తుంది. మనసుతోను చెవులతోను కాకుండా, సూటిగా హృదయంతో వింటూండటం మూలంగా నేను ఆ ప్రేమను అందుకో గలిగాను. జరుగుతూన్న సన్నివేశంలోని కమ్మని సారాన్ని జారవిడచుకొని, సంభాషణలోని 'అంశంపై మనసులోని కేంద్రీకరింప వీలులేనంతటి భాషాజ్ఞానం లేక పోవటం ఒక వైకల్యంగా కాక, ఇంచుమించు అనుకూలంగాను, లాభ కరంగానూ ఉంచవచ్చు.

అమ్మ చెప్పిందేదో ఈఆలోచనలను చక్కగా ధ్వనింప చేస్తోంది. ఆ సమావేశపు ముగింపు సమయంలో నన్ను, శ్యాంని (బ్రిటిషుసోదరులలో ఒకడు) దగ్గరకు జరుగమని సైగచేసింది. తన భృకుటి ముకుళించి మాకు ఏదో చెప్పాలని సరి అయిన పదాలకోసం వెతుకుతున్నట్లు, తనచేతిని గాలిలోకి ఊపుతూ, అమాయకమయిన నవ్వుతో, సాకు కోసమా అన్నట్లు 'Language Problem' అని చక్కగా

భారతీయుల రీతిలో పలికింది. అట్లా అన్నదోలేదో వెంటనే అమ్మకవళికలు ఆలోచనా మగ్నమైనాయి. తన వ్యాఖ్యకు తానే ప్రతిస్పందిస్తూ "భాషా సమస్య ఏమీలేదు. ఒకే ఒక భాష, మనసు భాష" అన్నది. మనసుభాష అనేటప్పుడు తన భావం మాకు తెలియ చేయటానికి, మా భావం తనకు తెలియచేయటానికి అన్నట్లు అమ్మ తన వంక, మావంక వేలెత్తి చూపింది. మానసిక భావ గ్రహణం Tele pathy) గురించి అమ్మ ఉదహరిస్తోందేమోనని, అది నీకు సాధ్యం కావచ్చు, మాకుకాదుగదా అని అలోచనలేకుండా అభ్యంత రం చెప్పాను. అమ్మ సమాధానంగా చిరునవ్వు నవ్వింధంతే. అటువంటి వ్యత్యాసాన్ని తాను గుర్తించటంలేదని ఆరకంగా స్పష్టంచేసింది.

ఈ మాటలలోని నిజాన్ని నాకు బలంగా బోధపడేట్లు చేసింది అమ్మ. అనాడు ప్రథమ దర్శనమప్పుడు నాకెంత తెలుగువచ్చో, అంత కంటె ఎక్కువేమీ నాకీరోజురాదు. నిజంగా నేర్చుకోవలసిన అవసరంకూడా నాకు అనిపించ లేదు. ఇప్పటికే మాటలతో నిమిత్తంలేకుండ తానందించిన దానికంటే మాటలతో తెలియచేయుగలిగిందింకేమి ఉందో నేనూహించలేకుండా ఉన్నాను. అనువాదకుని సహాయంతో నేను అమ్మతో సుదీర్ఘమైన చర్చలు జరిపిన కొద్ది సంద ర్భాల్లో పరస్పరం తెలియపరచుకోదలచిన సత్యం ఏదో విధంగా జారిపోతున్నట్లు, దాని పవిత్రతకు హాని జరుగు

తున్నట్లు భావించకుండా ఉండలేక పోయాను. నిశ్శబ్దమే ఎప్పుడూ పుష్కలంగాను, నిండుగాను తోచింది.

జీవితం ఎలాగడపాలో సందేశమీయమని ఒకరడిగి నప్పుడు అమ్మ ఇచ్చిన సమాధానం ప్రత్యేకంగా ఈ సందర్భరలో సముచితంగా ఉంటుందని చాలాసార్లు అనుకున్నాను.

"నిన్నోపని చేయమని ప్రేరేపించేదే నిజమైన సందేశం. ఆపని మాటలు చేయలేవు, మనం మాటలమీదనే ఆధారపడాల్సివస్తే ప్రతివిషయం అనుమానాస్పదంగాను, గందరగోళంగాను ముగుస్తుంది." దివ్యంగా ఉంది ! అమ్మ నిజంగా భాషకు గల పద్మవ్యూహం లాంటి లక్షణాన్ని వెలెత్తి చూపింది. మాటలే తుదిగమ్యంగా మనం తీసుకుంటే మనలనవి చిట్టచివరికి పరస్పర వైరుధ్యాల అధ్వాన్నపు స్థితికి, బయటపడేదారి లేని అవస్థకూ తీసుకువెళ్తాయి. మన అదృష్టవశంగా యోగి పూర్తిగా భిన్నమైన సీమలోంచి వ్యవహరిస్తాడు. తాను చెప్పే విషయం ద్వారా కాకుండా, తన ఎరుక ద్వారా మనలను ప్రభావితం చేస్తాడు. తన లక్ష్యం గురించి అమ్మ చేసిన వ్యాఖ్యానం దీనినే స్ఫురింప చేస్తుంది. "భాషకందని దానిని తెలియపరచేందుకే" ఈ రెండోదిలేని అవతారం అవసరమైంది".

దీని అర్థం అమ్మకు మాట్లాడటం కష్టమైన పని అని

గానీ, సత్యాన్ని గురించి వ్యాఖ్యానాలు చేస్తూ, దానిని వ్యక్తీకరించడంకన్నా మౌనంగా ఉండటమే మేలు అనుకొనే మునుల వంటిదని కానీకాదు, మాట్లాడటం అమ్మకి అసౌకర్యంగా ఉంటుందని చెప్పటంకాదు. మాటలలో అమ్మను మించిన చతురుల్నీ, వాటిని అమ్మకంటే ఎక్కువ రుచికరంగా వాడగల వారినీ నేను చూడలేదు. భాషను ఉపయోగించడంలో అమ్మకుగల నైపుణ్యము, ఆనందము ఒక రకమైన వినోదం నుంచి ఉత్పన్నమైనవే. శ్లేషలు, ప్రాసలు, భాషలోని శ్రావ్యత, పడికట్టు సమాధానాలు చెప్పటానికి కాక ప్రశ్నలు వేయడానికి భాషకుగల నిగూఢమైన సామర్థ్యమూ వీటియందు అమ్మకుగల ప్రేమే అమ్మచేత మాట్లాడిస్తాయి కాని, చాలా సందర్భాలలో ఎదుటివారిని ప్రభావితం చేసేందుకు, పకడ్బందీ అయిన సిద్ధాంతాలను రూపొందించేందుకు మనం అవలంబించే గంభీరధోరణిలోంచి ఉద్భవించిన నైపుణ్యంకాదది.

స్వవిషయాలు మొదలుకొని, వేదాంతంలోని క్లిష్టమయిన తాత్త్విక విషయాల వరకు హోరాహోరీగా సుదీర్ఘమైన చర్చలలో కాలం గడపాలనే ప్రధానమైన ఉద్దేశంతో వచ్చే ఆగంతకులు కొందరున్నారు. మాట్లాడటమనే తమ కిష్టమయిన అభిరుచిని అలవాటుగా అభ్యసించటానికి నా వద్దకు వీళ్లు వస్తారని అమ్మచెప్పింది. ఈ విషయంలో

అమ్మ ప్రతి శిశువు యొక్క ప్రత్యేకమయిన అభిమతానికి అవకాశం కలిగిస్తున్నట్లుగానే వీరి ముచ్చట తీర్చటానికి కూడా అవకాశం కల్పించటానికి పూర్తిగా యిష్టపడుతుంది.

మాట్లాడటం అభిరుచి ప్రధానమైన కాలక్షేపమనీ, అప్రధానాంశమనీ అమ్మ స్పష్టంగా ఎరుగును. చుట్టూ ఉన్నవారి హృదయాలు తెలుసుకునేందుకు కాని, తన అసాధారణ నిధి నిక్షేపాలు అందించేందుకు కాని ఎవరికి మాటలతో అవసరంలేదో వారి 'చేత' (కార్యరంగం) మరో చోట ఉంది.

మొదటి దర్శనం చివర జరిగిన ఒక సంఘటన ఇందులోని నిజాన్ని నాకు రూఢిగా ప్రదర్శించింది. కాసెట్ రికార్డరు ఒకటి లోనికి తెప్పించబడింది. కొన్ని భక్తి సంకీర్తనలు వినిపించబడినాయి. ఆ పాటలలోని స్ఫూర్తివంతమైన లక్షణం నామనోవృత్తికి చక్కగా అతికినట్లుంది. డాక్టరుగారి భార్య మమ్మల్ని భోజనానికి ఆహ్వానించడానికి లోపలికి వచ్చినప్పుడు, ఈ సంకీర్తన వదలుకోవలసి రావడం నన్నోక్షణం విచారంలో పడేసింది. అమ్మ నా వంకకు తిరిగి నాతోపాటు దానిని తీసుకువెళ్ళవచ్చునీ, ఇష్టమైతే భోజనాలగదిలో వినవచ్చునీ టేప్‌రికార్డర్ వైపు సైగ చేసింది.

సాధారణంగా అంత స్పష్టంగా నా ఆలోచనలను అమ్మ చదివిన విషయం ఎంతో వింతగా నాకు తోచి ఉండ వలసింది. కానీ అదంతా ఎంతో సహజంగా, ఆర్భాటం లేకుండా, గమనించని విధంగా జరిగిపోయింది. బిడ్డ ఆక లిగా ఉన్నాడని గాని, దెబ్బతిని ఉన్నాడనిగాని చెప్పకుం డానే తల్లికి తెలియటం బిడ్డకెలా వింతగా ఉంటుంది ? అమ్మ ఎరుకనుగూర్చి ఆశ్చర్యపడవలసిందేమీలేదు.

సహజ మాతృత్వ ప్రేరకమయిన ప్రవృత్తిగా తప్ప ఇంకోళ్ళ మనసుల్ని కావాలని చదివే ప్రక్రియగా మాత్రం నాకిది అనిపించలేదు. తనచుట్టూ ఉన్నవారి మనసులోని బహిర్గతమయిన విషయాలను తెలుసుకోవటం కాకుండా, ఆ విషయాల కతీతంగా దాగిన అంతరంగపు లోతులను అమ్మ క్రమం తప్పకుండా చూడగలగటం నిజమైన వింత అని తెలుసుకున్నాను. తరువాత తరువాత క్రమంగా ఈ మార్మిక రహస్యం విశదపడుతూ వచ్చింది. ఎలా వ్యక్తం చేయటం ? నిష్కళంకమయిన అమ్మ నిదానమైన చూపుల్లో పట్టు వడట మంటే – ఇంతకు ముందు మిగతావారంతా బాహ్యదృష్టితో చూశారని గుర్తించడమే. కానీ యిప్పుడు ప్రపంచం నన్ను చూస్తున్న విధంగా కాకుండా, నన్ను నేను చూసుకుంటున్న విధంగా కాకుండా, మార్పు చెందే భావ రూపాల కతీతంగా 'సత్యమైన' విధంగా నేను మొట్టమొదటి సారిగా చూడబడుతున్నా నన్న మాట.

ఆవారం రోజులూ నెల్లూరులో ఇట్టే గడిచిపోయాయి. నేను వదిలి వచ్చిన సమాజానికి తిరిగి వెళ్ళే సమయం ఆసన్నమయింది. వదలి వెళ్ళాలంటే నాకు తీవ్రమూ, అనూహ్యమూ అయిన విచారం కలిగింది. వారమేనా అయింది ? జీవిత కాలం నుంచో, ఇంకా ఎక్కువకాలం నుంచో అమ్మ నాకు తెలుసుననే భావన : మళ్ళీ తిరిగి వద్దామని దృఢంగా నిర్ణయించుకున్నాక మాత్రమే అతి కష్టంమీద విడచి వెళ్ళటం సాధ్యమయింది.

* * *

తిరిగి వద్దామనుకున్న ఈ నిర్ణయం నెరవేరటానికి ఎంతోకాలం గడవలేదు. కొన్ని నెలల తరువాత అమెరికాకు, న్యూజిలెండ్‌కు చెందిన ఇద్దరు సహచరులతో భూమ్యాకాశాలనే రెండు సముద్రాల మధ్య వ్రేలాడ దీసిన తెల్లటి ఓడలా ప్రకాశిస్తున్న అందరింటి దిశగా, చదునైన పంట పొలాల మధ్యగా నేను నడుస్తూండటం గమనించాను. "The wizard of OZ" అనే చక్కటి అమెరికా సినిమా లోని దృశ్యమొకటి నా మనసులో అసంగతంగా మెరిసింది. డొరాతీ, ఆమె స్నేహితులూ చెట్టాపట్టాలేసుకుని నృత్యం చేసుకుంటూ పసుపుపచ్చటి వీధి గుండా పచ్చ నగరానికి (Emarald City) వెళ్ళేదృశ్యమది. నిజంగా అసంగమూ విపరీతమూ అయిన దృశ్యమా ? వారిలో ఒకడు మనసు కోసం, ఒకడు హృదయం కోసమూ, పిరికి 'సింహం'

వెళ్తున్నారు. మనము, మనకంటె ముందు వచ్చిన అసం ఖ్యాకులైన వేలాది మంది యాత్రికులు నిజంగా వాటినే అన్వేషిస్తూ సూటిగా ఉన్న జిల్లెళ్ళమూడి మట్టిరోడ్డుకు రాలేదా ? ఈ ఉపమానం అంతటితో ఆగలేదని నాకు త్వర లోనే తెలిసింది. ఆ మాంత్రికుడు ప్రతి ఒక్కరిపట్లా ఏరకంగా స్పందించాడో మీకు జ్ఞాపకముందా ? ఈ విషయాలను ఆ మాంత్రికుడు తన యుక్తుల సంచిలోనుంచి 'హుష్' అంటూ బయటికి తీసాడా ? కానేకాదు. తన సహజమైన పద్ధతిలో ప్రతి ఒక్కరికి తను "చూసే విధానం తెలిస్తే తానేమి అన్వేషిస్తున్నాడో అది తనలోనే ఉన్నదని" అనువైన రీతిలో చెప్పాడు. అది సత్యం. (నిజం) ఈ మట్టిరోడ్డు మీద నడచి వెళ్ళిన ప్రతి ఒక్కరికీ అమ్మకూడా ఖచ్చితంగా ఇదే విషయం చెప్తుంది. అదీ సత్యమే (నిజమే).

కానీ మనం కథను దాటిపోయాం. ఆ సమయంలో మనం మన లోపాలను మాత్రమే యెరిగిన కేవల యాత్రి కులం మాత్రమే. ఆలోపాలు అద్భుతమైనరీతిలో బయటి నుండి పూరింపబడతాయన్న ఆశకూడా ఉందిమనకు: ఈ పరిస్థితిని ఇంకొక విధంగా ఇంతకన్న మంచి దృక్పథంలో చూడవచ్చునని మనకప్పటికింకా తట్టలేదు.

కొన్ని వారాలుండామని నా అభిప్రాయం. అంత క్రితం నేనసలు జిల్లెళ్ళమూడిని చూడకపోయినా ఈ

ప్రయాణం మాత్రం అన్నిటికన్న ఇంటికి వెళ్తున్నట్లుగా అన్పించింది. నేనూహించిన సమయంకన్న ఎక్కువకాలం జిల్లెళ్ళమూడి నా ఇల్లుగా అవుతుందని నేను శంకించలేదు. గడియారాలు, ఆత్రుతల విషయంలో ఉన్న పాశ్చాత్య ప్రమాణాలతో పోలిస్తే శాశ్వతత్వానికి అప్పటికే మధ్యే మార్గంలోవున్న ఈ క్రొత్త ప్రపంచంలోని కాలం తన రూఢ్యర్థాన్ని కోల్పోతుందని అసలే శంకించలేదు. అక్కడ రోజులూ, వారాలూ ఒకదాన్నుంచి వేరొకదానిని వేరుపర చేందుకు అవకాశము వీలులేకుండా దారిపొడుగునా గుర్తిం చేందుకు వీలయ్యే కొన్ని ప్రధానఘట్టాలతో తెలివికి అందని రీతిలో ఒకేఒక ప్రశాంత స్రవంతిలో లీనమైపోయేవి. అటు వంటి కాలరాహిత్యము, అంతటి ప్రశాంతత అంతటి ఏకాంతము ఇతఃపూర్వం నేనెన్నడూ అనుభవించలేదు. అత్యంత సరళము, ఉత్సాహవంతము అయిన నవ్యస్థితిని జీవితం సంతరించుకున్నది. తినేందుకు అన్నము, కట్టు కునేందుకు బట్టలు, సంకీర్తనానికి ఒకచోటు, నక్షత్రాల క్రింద నిద్రించేందుకు, ఉషోదయపు తొలివెలుగులో మేల్కొనేందుకు ఒక ఇంటికప్పు ప్రతి ఒక్కటీ అమరి వున్నాయి ఆందోళన చెందడానికి తగిన కారణమేదీ ఇక వున్నట్లు కనబడదు - గర్భకోశాన్ని పోలిన విశ్వంయొక్క ఏకకేంద్ర వలయాలగుండా అరుదుగా జారివచ్చే ప్రపంచ సంఘటనల వార్తలుకూడా.... నిజానికి ప్రత్యేకతను చేకూర్చే

వార్త ఏదైనా ఉన్నది అంటే ఒకటే– అది, తన ఆరోగ్యం మీదా, ఆగంతుక స్రవంతిమీదా, నిర్ధారించలేని మరికొన్ని కారణాలమీదా ఆధారపడి సాధారణంగా రోజుకు రెండు మూడుసార్లు అద్భుతంగా, అనూహ్యంగా అమ్మ ఇచ్చే దర్శనం– ఆమె ఇస్తున్నదా లేదా అన్నవార్త మాత్రమే.

'ఏసుక్రీస్తు వంటి సాక్షాత్కారం పొందిన యోగీశ్వరుని సాన్నిధ్యంలో జీవితం ఎలావుంటుందో నేను రూపొందించుకున్న కాల్పనిక దర్శనం జిల్లెళ్ళమూడిలోని జీవిత వాస్తవికతకు విరుద్ధంగా పరిణమించింది. మహిమాన్వితము, అద్భుతమైన రీతిలో నిబిడీకృతమైన ఉద్వేగంతో జగదుద్ధారకత ప్రకటించే వాతావరణానికి బదులు ప్రశాంతమైన కుటుంబ పరిసరాలను చూశాను. "న్యూయార్క్" నగర పెంపకంలో నేను అలవాటుపడిన బాహ్య ఉత్తేజకాలు ఏమాత్రమూలేని కొత్తరకపు మనుగడ అది. ఎరుకతోకూడిన ప్రయత్నమూ, ఉద్దేశ్యమూ ఏదీ లేకుండానే మనసు అంతర్ముఖం కాజొచ్చింది. వ్యక్తిత్వపు మురికినీరు కొద్దిగా తేరుకుని ప్రతివిషయమూ కొంగ్రొత్త స్పష్టతతో గోచరించ సాగింది. జిల్లెళ్ళమూడిలో సామాన్యవిషయాలు అశించని ఘనతని సంతరించుకున్నాయి. ఆధునిక జీవనవేగంలో గుర్తింపవీలుకానంతగా మసకబారిపోయే విషయాలు – బట్టలు ఉతుక్కోవటం, తినటం, మధ్యాహ్న సమయాలలో

ధైర్యం కోసమూ. దొరాతీ తిరిగి తన నిజమైన ఇంటికి టీ త్రాగుతూ స్నేహితులతో ముచ్చటించుకోవటం వంటివి- ఇక్కడ ప్రత్యేకంగానూ, విలువైనవిగానూ కన్పించటం ప్రారంభించాయి. ఒక్కసారిగా తీరికదొరికింది - పనులు సక్రమంగా చేసుకొనేందుకు, అపరాధ భావనకు గురికాకుం డానే ఏపనీ చేయకుండా ఉండేందుకు కావలసినంత తీరిక. సాధించవలసిందేమీ లేదిక్కడ. నీవు హాయిగా కాళ్ళు బార జాపుకొని నిపుణతతో కానీ, మోసంతోకానీ అనుకూలంగా మలచుకోవాలని తెగింపుతోకూడిన తొందరలో ఏనాడూ కనబడని విధంగా వస్తువులను చూస్తూ వుండగలవిక్కడ,

జిల్లెళ్ళమూడిలో రాజ్యమేలే దయార్ద్ర మైననిర్దిష్ట దిశారాహిత్యాన్ని చూస్తే ప్రత్యేకించి పాశ్చాత్యులు అప్పు డప్పుడు కొద్దిగా ఉక్కిరిబిక్కిరై పోతారు. సామాన్యంగా ప్రాపంచిక మైన వేడుకలు ఇక్కడలేవు సరికదా! తక్కిన ఆశ్రమాలలో కనిపించే నియతమైన ఆధ్యాత్మిక నిష్ఠాభావం కూడా కనుపించదిక్కడ. ఊరక వచ్చిపోయే ఆగంతకులు దీనిని అపార్థం చేసుకోవటం చాలా సులభం. అక్కడ పైకి కనపడే ధ్యేయరహిత జీవనం చాటునగల గంభీరలక్ష్యాన్ని చూడటం లోనూ, ఈ సోమరితనం నిజానికి నిండైనదీ, పుష్కలమైనది అనీ, ఈ విసుగుదలలో ఒక నిగూఢ పార వశ్యం ఉందనీ గ్రహించడంలో కృతకృత్యులు కాలేరు. వీనినన్నింటినీ సక్రమంగా అర్థం చేసుకోవటానికి అమ్మపట్ల

అమ్మబోధనల పట్ల ఉదారమైన పరిమాణంలో క్షమా, సహ నమూ కూడా ఉండాలి. జిల్లెళ్ళమూడిలో ఉండటం వలన ఖచ్చితంగా ఇవే లక్షణాలు నెమ్మదిగా పెంపొందుతాయి. ఇది ఇంచుమించు ఒక అదుపులేని పరిభ్రమణం. అందువల్ల ఒకసారికి కొద్ది రోజుల కంటే ఎక్కువ కాలం జిల్లెళ్ళమూడిలో నిలువలేని వారు భక్తుల్లోనే చాలామంది వున్నారు. అప్పుడు కూడా కష్టమైన తపస్సు చేసినట్లుగా తమను తాము అభి నందించు కుంటారు.

కానీ వీరి కంటే భిన్నమైన వ్యక్తికి జిల్లెళ్ళమూడి అంతరవలోకనానికి, ప్రగతికి అద్వితీయమైన పరిసరాలను సమకూరుస్తుంది. అభ్యాసం వలన పొందిన అనుభవంతో అమ్మ బోధిస్తున్న విలువలని కొంతైనా నేర్చుకున్నది నేనిక్కడే. జీవితంలో తటస్థపడేవాటిని (సంఘటనలు కాని అనుభవాలుకాని) కృతజ్ఞతతోనూ ఆదరంతోనూ సమ్మతించ టం, జీవితంలోని సామాన్య విషయాలలోని మహనీయతను అర్థం చేసుకోవటం, తన నవ విధానాన్ని ప్రపంచం మీద రుద్దాలని మితిమీరిన పెనుగులాటకు పాల్పడకుండా వుండ టం, గమ్యోన్ముఖమైన మన సమాజానికి ఈ రోజులలో వీటి కొరకు సమయం దొరకని అనుభవ పూర్వక మాతృత్వపు విలువలివి. ఇటువంటి వైఖరులు స్తబ్ధతకు, అభివృద్ధి నిలిచి పోయేందుకు దారితీస్తాయనే అభ్యంతర పరంపరలను నేను

వినగలను. 20వ శతాబ్దపు పాశ్చాత్య మానవునిగా పాక్షికంగా నా అభ్యంతరాలూ అవే. అందుకేనేమో ఈ అభ్యంతరాలను నేను చక్కగా వినగలనను కొంటాను. కాని స్వీయ ప్రాబల్యం కోసం, ప్రగతికోసం - తునా తునకలై పోవడానికి, తనను తానే విషమయం చేసుకోవడానికి, అస్తిత్వం కోల్పోయేంత వరకు తనను తాను ద్వేషించుకొనేందుకు సిద్ధంగా వున్న ప్రపంచం కోసం - మన ఆలోచనా రహితమైన వెఱ్ఱిదూకుడు వలన కల్గే ఫలితాలేమిటి? విరుద్ధ దిశలో పనిచేసే ఈ వేలంవెఱ్ఱిని కొద్దిగానైనా సమతూకంగా వుండేందుకైతే మాత్రం, కొద్దిపాటి స్తబ్దత, కొద్దిపాటి భక్తి వుండటం అంత చెడ్డ విషయమేమీకాదు. అందుకనే పెద్దగా ఏమీ జరుగుతూన్నట్లు తోచని జిల్లెళ్ళమూడి నా గ్రంథానికి తగిందే. అన్ని పనులూ ఎలాచేయాలో నేర్చుకునేందుకు అనేకమైన ఇతర ప్రదేశాలున్నాయ్. పనులు చేయకుండా ఎలా వుండాలో నేర్చుకోవడానికి - బాంబులు చేయకుండా వుండడానికి, విప్లవాలు - అవి ఆధ్యాత్మికమైనవైనా - అవి ప్రోత్సహించకుండా వుండడానికి, ఎవరిని వారు పట్టించుకోకుండా వుండడానికి జిల్లెళ్ళమూడి తగిన ప్రదేశమే. అటువంటి ప్రయోజనం లేని చోటు ఒకటైనా వుండటం మంచిదే. ఎవరికి తెలుసు? అది ప్రయోజన కరమైంది కూడానేమో?

పైపెచ్చు అది మొదట్లో కనబడినంత అనాసక్తి కరమైంది కాదు. చూడ్డానికి అందరికీ అక్కడ ఏమీ జరుగు

తున్నట్లు లేకపోయినా, అక్కడ ఎంతో జరుగుతుంది. జిల్లెళ్ళమూడిలోని నాటకం అంతర్ముఖమైనది. 'రొట్టె-సర్కసులు' వంటి అవిశ్రాంత వినోదం కాదక్కడ మనల్ని నిమగ్నం చేసేది. అది సర్కసే అనుకుంటే, అది మిగతా వాటితో పోలిస్తే అణకువతో మనసు గుడారంలో సాగే రింగాట వంటిది. క్రమక్రమంగా తెలిసేదేమంటే ఒకే గూఢమైన మూటలో ఒదిగిపోయే మాంత్రికుడు, మావటీడు, రింగ్ మాస్టరు, విదూషకుడు అమ్మేనని. అమ్మను గమనించటం, అమ్మ రహస్యాన్ని గూర్చిన సమాలోచనమే 24 గంటల వుద్యోగమౌతుంది. అమ్మను అవగాహన చేసుకునేందుకు, నిలవేసేందుకు కాస్త ప్రయత్నించి చూడు - వెంటనే అమ్మ మరోవేషంలో మరోపాత్ర ధరిస్తూ వుంటుంది.

అట్లా అంటే అమ్మలో మనను లేశమాత్రంగా నైనా మాయ చేసే లక్షణం వున్నదని ధ్వనింప చేయుటం కాదు. తద్భిన్నంగా అమ్మ అంత సూటిగానూ, నిష్కపటంగానూ మరెవరూ వుండలేరు. అచలంగా 'అమ్మ' అమ్మగానే వుంటుంది. మనకు పరిచితమైన రూపాల్లోనికి - గురువుగా, ఋషిగా, హితునిగా, దైవంగా - అమ్మను బిగించుకునే ప్రయత్నంలో సంభ్రమకారక మైన మార్పులకు మనమే కారణమౌతాం. ఎందుకంటే ఎంతోకాలం మన ఇరుకైన గూడులలో అమ్మ అనివార్యంగా నిలవలేదు గనుక. వారిలో అధికతరమైన వారి కంటె అధికతమమైంది అమ్మ.

అమ్మను తెలుసుకోవటం అసాధ్యమనే ఆత్మ సమర్పణా భావం కలగనంత వరకు "అమ్మ ఎవరు?" అన్న ప్రశ్న సమాధానం లేని ప్రశ్నగానే మిగులుతుంది. అది కలిగిన క్షణంలో ఈ ప్రశ్నకు సమాధానం స్ఫురిస్తుంది. ఆ క్షణాలలో దయా అంతర్దృష్టుల వినూత్న భూమికలు, అందీ అందని రీతిలో పూరిస్తున్న అమ్మలో మూర్తీభవించిన అత్యున్నత జీవితానికైన తపన మనం అయత్నంగా అనుభవిస్తూండటం గమనిస్తాం.

అమ్మ మనకేదో చేయాలని ఆశించి మనం జిల్లెళ్ళమూడి వస్తాం. కాని కొంత కాలానికి "తల్లి" ప్రభావం మనం వూహించినట్లు యాంత్రికంగా నిరంకుశంగా వుండదని మనకు అవగతం కావడం మొదలౌతుంది. అమ్మ నిరంతరమూ వుండే ఒక ఆశ్రయముగానూ ఆధారముగానూ మానసిక రసాయనికచర్యల త్వరితాన్ని, అందుకై పరిపక్వం చెందిన వారిలో సుసాధ్యం చేసే ఒక శక్తివంతమైన ఉత్ప్రేరకముగానూ ఉండటం కన్న అమ్మ సూటిగా చేసేది పెద్దగా వుండదని అర్థంచేసు కుంటాము. ఫలితాలు ఒక విధంగా చూస్తే వుద్దేశపూర్వకమైనవికావు. పువ్వు ఒక ప్రత్యేకమైన పద్ధతిలోనే పెరగాలనిసూర్యుడు ఉద్దేశిస్తాడా? దాని ప్రకృతి శాసించిన విధంగా పూవు వికసిస్తుంది. కేవలం దాని వికాసానికి కావలసినప్రేరణని సూర్యుడందిస్తాడు.

జిల్లెళ్ళమూడిలో ప్రజలు పొందే మార్పుల వైవిధ్యం మాత్రం నిజంగా అసాధారణమైనది. అక్కడ నాస్తికుడు తాను నిర్నిమిత్తంగా భగవంతుణ్ణి ప్రార్థించటం గమనిస్తాడు. పండితుడు తాను పెంచి పోషించుకున్న మూఢ సిద్ధాంతాలని మొదటిసారిగా ప్రశ్నించుకోవటం గమనిస్తాడు. ఎందుకోసం వచ్చాడో దానిని ప్రతి వాడూ పొందడు. అయితే తాను పొందింది మాత్రం తానూహించిన దానికంటే గొప్పది, సముచితమైనది అయివుంటుంది. కొందరున్నట్టుండి యోగులుగా మారిపోతారు. కానీ చాలా తక్కువ మంది మాత్రమే వారి హృదయాలు కొంచెం కూడా విశాలం కాకుండా వారి మనసుల్లో తమకు అలవాటైన దృక్పథాలే సరియైన వన్న నమ్మకం కొద్దిగానైన సడలకుండా విడిచి వెళుతుంటారు. ఇంచు మించు నేనెరిగిన మిగిలిన ఆధ్యాత్మిక సంస్థలన్నింటికీ భిన్నంగా జిల్లెళ్ళమూడిలో ప్రజలెవరూ ప్రత్యేకమైన విశ్వాసాల సముదాయంలోకి నూరిపోయబడరు. నేను నిశ్చయించ గల్గినంతవరకు ఎవరూ అమ్మ ఆలోచనలని మతిలేకుండా చిలుకపలుకుల వలె వల్లిస్తూ ఆచోటువదలి వెళ్ళలేదు. బహుశః ఎవరూ కూడా అలా వల్లించడానికి వాటిని పూర్తిగా అర్థంచేసుకుని వుండరు! కాని ఏది ఏమైనా చాలా మంది మాత్రం క్రొత్తవైన కొన్ని స్వంత భావాలతో జిల్లెళ్ళమూడి వదలి వెళ్తారు. ఇదే మొదటినుండి అమ్మ మనసులో ఉందేమో అనిపిస్తుంది.

పైనుండి అమ్మ ఏ విషయమూ రుద్దకుండా లోపల సిద్ధంగానున్న దానిని బయటకు రానిస్తుంది. నాస్వంత విషయంలో ఆచరణయోగ్యతకు ప్రాధాన్యాన్నిచ్చే పాశ్చాత్య సంస్కృతి ఎంతగానో అపార్థం చేసుకొని, నిర్లక్ష్యం చేసిన నిగూఢమైన హార్థిక విలువలను గూర్చిన పెరుగుతున్న ఎరుకతో నేనక్కడున్న మొదటి కొన్ని నెలలు విశేషమైనవిగా గడిచాయి.

* * *

భావాన్ని పణంగా, ఆలోచనని ప్రోత్సహిస్తూ, కంటి కందనిది, సూటిగా ఫలప్రదంకానిది' అయిన, ప్రతివిష యాన్ని తీవ్రమైన అనుమానంతో చూసే పరిసరాల్లో మిగతా అమెరికా పురుషుల వలెనే నేనూ పెంచబడ్డాను. మొత్తం మీద ఒకని అంతర్జీవితం అనేది అసలు వుండనట్లుగా ప్రస్తా వించటం పురుషకారంగా నిర్ధారింపబడింది. అలా సాధ్యం కాకపోతే: తగినంతకాలం యెడతెగని, పర్యాలోచతేని పోటీ లతో కూడిన కార్యకలాపాలలో మునిగితేచాలు. అదృశ్య మయ్యే ఇబ్బందికరమూ బాధాకరమూ అయిన అవశేషంలా తలంచబడింది.

అసౌకర్యంగా అదిఎప్పుడూ పూర్తిగా మాయంకాదు. కానీ ఆశించిన విధంగా అది నేరుగా, బలంగానూ పెరగదు.

సుదూర చైతన్యపు టంచులో గిడసబారిన మసకచీకటి మనుగడను సాగిస్తుంది. ప్రకృతి వెన్నెముకగా ఎంచిన జీవగఱ్ఱ జీవపుటంచున నిష్ఫలంగా ౹తాకుతుంది. పవిత్రమైన వృక్షం వంధ్యంగానూ, ఒంటరిగాను పెరుగుతుంది.

ఇక్కడ బుద్ధిపూర్వకంగా జిల్లెళ్ళమూడికి నా సుదీర్ఘ యాత్ర ప్రారంభమైనప్పటి రూపొందే నవయౌవ్వన ప్రాయానికి కథనం సంక్షిప్తంగా మార్చటం బహుశః ఉపయోగకరం కావచ్చు. నా తరానికి చెందిన చాలామంది వలెనే నేను కూడా మన క్రమబద్ధమైన, పుష్టివంతమైన జీవితాలలో ఏదో లోపించిందని కలవరపరచే స్ఫురణతోనే పెరిగాను. రాజకీయ తిరుగుబాటు, సామాజిక సంప్రదాయ వ్యతిరేక ధోరణులూ, మాదకద్రవ్యాలు వంటి అన్ని సామాన్యదశలను చివరకి ఇవేవీ తొలిచివేస్తున్న వెలితిని నింపలేవనిపించినపుడు కల్గిన కనువిప్పునూ అనుభవించాను.

బాహ్యమైన ఈ అన్వేషణతోపాటే వస్తువృత్తులను గూర్చిన అంతశ్శోధనకు బీజరూపమైన ప్రారంభం జరిగింది. రేపుగాని డెభై ఏండ్లకుగాని – నిర్దయగా వినాశనానికి పరుగులు తీస్తున్న ఈ జీవితానికి అర్థం ఏదైనా వుండివుంటే అదేమిటి ?

సృష్టి కాలమానాన్ని బట్టి చూస్తే మరుక్షణమే ఒక్కటీ బూడిదపాలయ్యే ఈ ప్రపంచంలో ఆశకీ, ప్రేమకీ

కీర్తికి, అదృష్టానికి ఏమయినా అర్థం ఉందా? ఎవరైనా ఈ గంభీరమైన ప్రశ్నల్ని మరచి అల్పమైన మనుగడ మొత్తం సాగించడంలో భయంకరమైన జాలి గొలిపే దేదో లేదూ? భూమ్మీద అవతరించి నప్పటికన్నా వీసమంత ఎక్కువైనా జీవితపరమార్థం గురించిన అవగాహన లేకుండా భూమిని విడిచివెళ్ళడం హృదయ విదారకం కాదూ!

చాలా తరుచుగా జరిగే విధంగా, తిరస్కృతుడై దిగ్భ్రాంతి చెంది ఎండిన ఎముకలపోగుగా చివరికి ఏ ఫ్లొరిడా బీచ్‌లోనో ముగిసిపోయే ఒక మధ్య తరగతి అమెరికా వాసుని విలక్షణమైన శూన్య జీవిత చక్రాన్ని గురించి పబ్లిక్ స్కూల్లో నేను వ్యాసం వ్రాయటం గుర్తుంది. వృద్ధాప్యంలో మియామీ హోటల్‌కి వలసపోయిన మా తాతగార్ని గూర్చి నేను ఆలోచించాను. దేనికోసం బ్రతికాడో దానిని గురించి ఆయనకేమయినా స్పృహఉందా? గడచిన సంవత్సరాలు ఆయన్ని కుంగదీశాయి, ఇప్పుడు ఖాళీగా ఎండలో కూర్చున్నాడు. ఇదీ అమెరికన్ కల. ఇంతేగా? తాటిచెట్లు అంచులతో ఉన్న ఇసుక తిన్నెలకు నిర్గమించుటమేకదా! ఇప్పుడొకడు పనిచేస్తాడు. తరువాత జీవించడం ప్రారంభించ గలుగుతాడు. ప్రారంభించే సమయం వచ్చేటప్పటికి అంతా మించి పోతుంది. జీవితం ఇప్పటికే చాలా గడిచి పోయింది. కాళ్ళు కరిగిపోయాయి. ఎదురు చూడటం — చావుకోసం ఎదురు చూడటం తప్ప ఇంకేమి చెయ్యాలన్నా

అసాధ్యమౌతుందప్పుడు. కలలు లేకుండా జీవించటం. వివేకం లేకుండా చావటం - దీనికంటే మంచిమార్గం వుండి తీరాలి. నేనిటువంటి బ్రతుకు బ్రతుకను. ఇటువంటి చావూ చావను. ఇదీ నేను చిన్నవుడు వ్రాసిన వ్యాసంలోని మనసును కరిగించే ముగింపు.

కానీ యౌవ్వనానికి తన గమ్య దిశమీద కంటే తన శక్తియందే నమ్మకం ఎక్కువ. జీవితం నుండి నిజంగా నేను పొందదలచిందేమిటి? నేను దాని నెక్కడ పొంద గలను? మార్గదర్శి లేకుండా, దారి చూపే భౌగోళిక పటం లేకుండా, గమ్యానికి చెందిన ఆలోచన లేకుండా - ఏదో ఏదో ఇంత కంటే మించిందీ గొప్పదీ వున్నదనీ, దాన్ని నేను అన్వేషించాలనీ ఎంతో అస్పష్టమైన భావంతో నేనొక వంటరి యాత్రలో వున్నాననిపించింది. ప్రాచీన కాలంలో ఈ యువకుల ఆధ్యాత్మిక ఆదర్శవాదాన్ని ఉపదేశాలవైపు దార్శనికత వైపు ఎలా మళ్ళించాలో సమాజానికి తెలుసు. ఈ రోజులలో ఈ పాత త్రోవలన్నీ చదునుకాబడి వాటి స్థానే గమ్యం లేని సరిక్రొత్తవైన అతిగొప్ప రహదారులు వచ్చాయ్. కానీ అక్కడక్కడ గుర్తు స్తంభాలు మాత్రం మిగిలిపోయాయ్. చెల్లాచెదురుగా వున్న ఈ శిధిలాల మీదే నా తలపు నిలచిపోయింది.

ముఖ్యంగా స్వదేశీ అమెరికా యువకులైన థోరియో విట్మన్ అనే ఇద్దరి రచనలవల్ల మొదటిసారిగా నాకు జ్ఞాన ప్రతిబింబపు వెలుగులాంటిది వచ్చింది. నేను నిలచిన చోటనే నాకు ముందు వారు కూడా నిలచారని, త్రోవ విడచిన ఆ ఆలోచనలే చేశారని తెలుసుకోవటం ఎంతో హాయి. అయెరుక నాకెంతో ధైర్యాన్నిచ్చింది. ఈ ప్రవాహం నుండి విడిపోవటం, అవసరమైతే ఏదో ఒక నిర్జన కాసారానికి తరలిపోవటం, పోయి అక్కడ సమాజమనే బజారులో ప్రస్తుతం దొరికే దానికంటే గంభీరమైన సత్యాన్ని దర్శించటం సాధ్యమేననిపించింది. థోరియో అదే చేశాడు. దాన్ని చెయ్యగలగొచ్చు. "జయించాలని అంత తెగింపుతో కూడిన తొందర మనకు ఎందుకుండాలి ? సహచరులతో సమంగా ఏ మనిషైనా అడుగులు వేయకపోతే బహుశ అతడు వేరొక వాద్యాన్ని వింటున్నందువల్ల కావచ్చు. ఎంత దూరమైందైనా, లయబద్ధమైనదైనా, ఆ సంగీతానికి అనుగుణంగానే అతణ్ణి అడుగులు వేయనీయండి." అన్న అతని మాటలు నాకు ధైర్యాన్నిచ్చాయి. ఖాయంగా సంగీతందూరంగా, లయబద్ధంగానే వుంది. థోరియో విషయంలో కూడా అదే జరగకుండా లేదుకదా! అని నేనాశ్చర్యపడ్డాను. మానవుల తీరు – తెన్నులపట్ల ఒక ముని చూపిన నవ్వుపుట్టిచ్చే అలక్ష్యంలో వాల్డెన్‌పాండ్ దగ్గర నిజంగా దారిముగుస్తుందా? లేకపోతే దానిని దాటుకొని ఇంకా మరింత శాశ్వతమైన

ఆత్మస్థానానికి పోతున్నదా ? థోరియో, ఇంకా మరి ఇతర అతీంద్రియవాదుల రచనలు తాత్కాలికమైనవిగానూ, అందుబాటుకి కొంచెందూరంగావున్న దాని అవగాహనగానూ, మరింత అధికమైన మాధుర్యపు ప్రతిధ్వని గానూ కనిపించాయి.

ప్రధమంలో మహనీయులలో తహ తహ కలిగించిన భగవద్గీతలో నా ఆత్మ తీవ్రంగా కోరిన ఆ విస్తృత మధుర స్వరం విన్పించింది. పదహారేళ్ళ ప్రాయంలో గీతకు నేను గొప్పగా చలించిపోవడమనేది జరగటం ఎలా సంభవించిందో ఈ రోజు వరకు నాకు అంతు చిక్కని విషయంగానే మిగిలి పోయింది. మతాన్ని అనాసక్తికరమైన, ఈ కాలానికి అసందర్భమైన దానినిగా భావించే పరిసరాలలో పెరిగాను నేను. శాస్త్రజ్ఞానం లేని అజ్ఞానులు తమకు అర్థంగాని ప్రకృతి యదార్థాలను వివరించే పద్ధతులే భగవంతుడని, ఇపుడు మనకు నక్షత్రాలూ, మానవులూ ప్రపంచంలోని వివిధ జీవ రాసులు ఎలా పరిణామం చెందాయో తెలుసు కాబట్టి, మానవ రూపంలోవున్న భగవంతుని వెనుక దాక్కోవడానికి ఏసాకూ లేదని నేను బోధింపబడ్డాను. దీనికి మించింది మతానికి వుండవచ్చని నాకేనాడూ అన్పించలేదు.

నిజానికి నా ప్రయత్నపూర్వకమైన నాస్తికత చాలా పలుచని పొరగా వుండి తీరాలి. ఎందుకంటే జాన్

మార్కోస్ స్ఫూర్తి ప్రదంగా అనువదించిన గీత సాదా ప్రతి మొదటి పఠనం నన్ను ఆనందాశ్రుతీరం వరకు తీసుకు వెళ్ళింది. చేతిలో పుస్తకంతో మా తండ్రి దగ్గరికి హుటా హుటిన వెళ్ళి నా అమాయకపు వుత్సాహంలో ఆయన గీతను చదవాలని ఒత్తిడి చేసాను. ఆయన చదివాడు. కానీ అనూహ్యమైన ఆయన ప్రతిస్పందన వినేసరికి నేనెంతో నిరుత్సాహ పడ్డాను. అంత వుద్వేగంతో పొంగిపోయేందుకు అందులో ఏమి వుంది? అని ఆయన ఆశ్చర్యపోయాడు. ఎంతైనా అది కేవలం పురాణం, కల్పితం అన్నాడు. అది కేవలం కల్పనా! నేను దిమ్మెరపోయాను. ఎవరైనా కానీ అంతటి కదిలించే సత్యావిష్కారాన్ని కల్పితమని ఎలా అనగలరు? నా మటుకు నాకు గీతలోని సంఘటనలు నిజంగా జరిగాయా? అని ఆశ్చర్యపడాలని అసలు స్ఫురించనేలేదు. కురుక్షేత్ర రణరంగంలో ఒక చారిత్రక పురుషుడైన కృష్ణుడు, ఇంకొక చారిత్రక పురుషుడైన అర్జునుడితో మాట్లాడితే ఏం పుట్టి మునిగింది? ఇప్పటికీ వున్న ఆ పట్టణాన్ని కొన్ని సంవత్సరాల క్రితం ఢిల్లీ నుండి హిమాలయాలకు పోయే త్రోవలో నేను చూడ్డం జరిగింది. వాస్తవ మేమిటంటే ఆ కృష్ణుడు నా హృదయ రణస్థలిలో నాతో మాట్లాడాడు. జీవితమంటే ఏకొద్దిపాటి నగలకోసం, అశాశ్వతమైన కొద్దిపాటి కీర్తి అధికారాలకోసం, అప్పుడప్పుడూ కలిగే ఆనందంలేని ఇంద్రియ సౌఖ్యం కోసం

70, 80 ఏళ్ళపాటు కొనసాగే ప్రాకులాట కాదని తద్భిన్నంగా అదొక సాహసకృత్యమని, పరిమితత్వం నుండి అనంతత్వానికి వ్యక్తి తన అతీంద్రియమైన మూలస్థానానికి సాగించే ప్రయాణమని, నేను అప్పటికే నమ్మినవాటిని బలంగా ధృవపరిచాడు.

గీతను నేను తేలికగా ఒప్పుకోవడానికి బహుశ అది ఏనాడూ నాకు మతంగా గోచరించక పోవడమే కారణమై వుంటుంది. గీతలోని భగవానుడు నేను నమ్మని భగవంతుని వలె ఎంతగా లేడంటే ఆ ఇద్దరికీ మధ్య సంబంధం కల్పించాలని నాకసలు స్ఫురించనే లేదు. పితృభావంతో భయం గొల్పుతూ జోక్యం కలగ జేసుకునే ఒకే మూసకు చెందిన ప్రసిద్ధ పాశ్చాత్య వృద్ధునికి భిన్నంగా గీతలోని భగవంతుడు కేవలం చైతన్యానికి మరోపేరై, దాని భ్రమలను, పరిమితులను, ఆశలను, భయాలను ఒలిచివేయబడి అన్ని దృగ్గత రూపాల వెనుక అనుస్యూతమై ఐక్యత కల్గించే పరమసత్యమై వున్నాడు. నమ్మకుండా వుండడానికి ఆ భావంలో ఏముంది? జీవితంలోని ఈ అంతర్గత దివ్య పవిత్రతను ఆవిష్కరించుకోగలమన్న కృష్ణుని అభయం తర్కబద్ధంగానేకాక అత్యంత వుత్తేజకరంగా కూడా వుంది. దానిని చదివిన రోజునే నేను నిర్ణయించుకున్నాను. ఏదో ... ానానికై ఆయనతో తలపడాలని.

మరీ మరీ చిరిగిపోతున్న గీతసాదా ప్రతిని సంవత్సరాల తరబడీ చేతికి అందుబాటులో వుంచుకున్నాను. నాకు అది ఒక తాయత్తులాగా ఆ సర్వోత్కృష్టుడైన పరమేశ్వరుడు ఋణపడిన పెన్నిధిని ఏదోఒకరోజు నేను అందుకోగలనని పించింది. అత్యున్నతమైన ఉద్దేశ్యాల అనివార్యపురాత (తలవ్రాత) ఏమనిపిస్తుందంటే, అంతకంటె తక్కువ యోగ్యమైన లక్ష్యాలవల్ల పలచబడిపోతాయవి. పాపాలనుండి విముక్తుని చేయుమని భగవంతుని ప్రార్థిస్తూ "కానీ ఇంకా అప్పుడేకాదు" అని అనిశ్చిత హృదయంగల పశ్చాత్తప్తుని లాగా చేతిలోవున్న పనిమీదకు, నిర్మించుకోవలసిన భవిష్యత్తు మీదకు, కాలేజీ కార్యకలాపాలమీదకు నాధ్యాస మళ్ళించాను. ప్రపంచపు వేలాది అపస్వరాల మధ్య భగవద్గీత యొక్క ఉచ్ఛైస్వరము కళావిహీనమై పోయింది.

ఆ తరువాత పరస్పర విరుద్ధ ఆదర్శాలమధ్య సంవత్సరాల తరబడి వూగిసలాట జరిగింది. పిడచకట్టుకుపోయిన అంతరంగం ఆర్తితో కోరే చైతన్య దాయకమైన ఆధాత్మిక వర్షం గురించి ఏమాత్రం లేకుండా, సంస్కృతీ జ్ఞానాల ఎండమావులవంటి వ్యామోహాలనే కాలేజీ ఇవ్వజూపింది. పోగాపోగా ఇదంతా వుత్త బూటకమని తోచింది. ఎవరికి వారు వారి ప్రత్యేకమైన పాండిత్యపు గూటిని నిస్సందేహంగా, సంపూర్ణంగా యెరిగినవారే. కానీ మనలో ఎవరూ సమగ్రమైన జీవితంకోసం కొద్దిమాత్రమైన తపన

అయినాపడేది ? దంభప్రాయమైన విస్తృతిని కలిగివున్నా ఆ "జ్ఞానజలధులు" పరిపోషకమైన వివేకపు తీయటి నీటి బొట్టు ఒక్కటికూడా లేని ఖాళీవని తెలిపోయింది.

నా కాలేజీ రోజుల్లో ఒక సందర్భంలో నేను మానవ పరిణామ శాస్త్రపు వున్నతశ్రేణి పరీక్ష పూర్తి చేయటానికి అవసరమైన భాగంగా మధ్య అమెరికాలో ఒక పురావస్తు పరిశోధనకు చెందిన త్రవ్వకంలో పాల్గొన్నాను. 'కోస్టారికా' లో అందమైన పసిఫిక్ సముద్ర తీరంలో అంతరించిన నాగరికతకు చెందిన పాతచెత్త కుప్పలను త్రవ్వుతూ మేమువెలికి తీసిన అంతులేని ఆలుచిప్పలను, మట్టిసామాగ్రిని వర్గీకరిస్తూ అక్కడ మాలో ముప్పైమంది వున్నాము. కాలక్రమేణా అనుమానాస్పదమైన ఆ ప్రయత్నమంతా విద్యావ్యవస్థల సాధారణ వైఫల్యానికి సంకేతంగా నాకు తోచింది. ప్రతి వాడూ వాడు ప్రత్యేకించిన విభాగపు జ్ఞానశకలాలను వెలికి త్రవ్వుతూ వర్గీకరిస్తున్నాడు, కాకలు తీరిన విద్యాంసులలో ఎవరు తిరిగి వాటిని యథాస్థానంలో ఉంచేందుకు ప్రయత్నిస్తున్నారు ? ఆ మాటకొస్తే ఆ తునకలన్నీ ఇంతకన్న విశాలమూ, ఇంతకన్న ముఖ్యమూ అయిన ఒకానొక వస్తు ఖండాలని ఎవరికసలు అవగాహన వుంది ?

ఆ వేసవి చివరకి మేము ముప్పైమందిమి అప్పటికే పోగైన మనిషి విజ్ఞానపు కుప్పకు కొన్ని వాస్తవాలను చేర్చాము. వేయి సంవత్సరాల క్రితం కొంతమంది మను

ష్యాలు ఆ చెత్తలో విసరిందేమిటో మాకిప్పుడు ఖచ్చితంగా తెలుసు వాళ్ళ తలకాయల్లో ఏముంచుకున్నారో మాత్రం పూర్వంలాగే అనూహ్యంగా వుంది. జిల్లెళ్ళమూడిలో వుండగా సాధారణంగా నా మానవ పరిణామ శాస్త్రపు శిక్షణ గురించి, ఈ అనుభవాన్ని గురించి అప్పుడప్పుడు పునరాలోచించేవాడిని. భారతదేశం వంటి సజీవ సంస్కృతులలో గల నిగూఢ సత్యాలు పశ్చిమ దేశాలలోని మాకు అన్ని సందర్భాలలోనూ వుపయోగం లేని మూసిన పుస్తకాలే. ఒక రామకృష్ణుని, ఒక గాంధీని తీర్చిదిద్దిన సాంస్కృతిక అంతర్దృష్టుల యొక్క సరియైన, శక్తి వంతమైన అవగాహన నుండి మన నాగరికత ఎంత ప్రయోజనం పొంద గల్గింది ? భారత దేశపు వీరుల గూర్చిన చైతన్యవంతమైన అవగాహన మనకు కొరవడినా ఫర్వాలేదుగానీ ప్రాచీన కాలంనాటి వారి పూర్వీకులు ఆ చెత్త కుప్పలో ఏమి విసరి వేసారో మాత్రం మనకు అన్ని వివరాలు క్షుణ్ణంగా తెలుసు! పురావస్తు పరిశోధకులు అలా జరిగేటట్టు చూసే వుంటారు!

నా తరగతి పని రానురాను కృతకంగానూ ప్రతిఫల రహితంగానూ కానవచ్చేసరికి, నేను అవసరమైన చదువుని ఎగవేసి, కాలేజీ గ్రంథాలయంలో నా అంతరన్వేషణకు సంబంధం వున్నదనిపించిన పుస్తకాలు - జెన్ బౌద్ధం మీద, భారత దేశం మీద, యోగుల చరిత్రల మీద వున్న పుస్త

కాలను నా కండుబాటులో వున్న వేపైనా చదివేస్తూ కాలం గడపటం గమనించాను. ప్రత్యేకించి ఒక గ్రంథం పూర్వం ఏ గ్రంథమూ రేకెత్తించనంత ఆలోచనను రేకెత్తించింది. మహిమాన్వితులైన యోగులు, ఋషులలో ఇతిహాసం వంటి ఈ గ్రంథాన్ని చదివిన వారు మాత్రమే వున్నత విద్యాభ్యాసపు కోరల్లో చిక్కుకున్న యువక అన్వేషకుని మనసుపై ఈ గ్రంథం చూపగల జాజ్వల్యమానమైన ప్రభావాన్ని అర్థం చేసుకోగలరు. భారత దేశానికి అక్కడికక్కడే మూట ముల్లె సర్దుకుందామనిపించింది.

భగవద్గీత కావ్యరీతిలోసర్వోత్కృష్టమైన అదర్శాన్ని జాడతీస్తే, యోగానంద ఆత్మకథ దానికి ఒక ముఖాన్ని, కండను చేకూర్చి పొందదగినదిగానూ, అభ్యాసయోగ్యంగానూ కనబడేటట్లు చేసింది. కృష్ణుడు వాగ్దానం చేసిన, భయభక్తులు గొల్పే చైతన్యపు శిఖరాలు చేరుకున్న మనుష్యులు ఇంకా భారత దేశంలో జీవించివున్న విషయాన్ని అన్నిటికన్న మిన్నగా ఆ గ్రంథం ప్రదర్శించింది. వారి సాన్నిధ్యంలో వుండటం అంటే అనూహ్యసీమలకు పంపబడినట్లు భావించటమే.

నాకోసం తీర్చి దిద్దబడిన పని నాకుంది. ఏమి వెదుకుతున్నాడో అన్వేషకు డిప్పుడు తెలుసుకున్నాడు. తానొక ఋషిని వెదుకుతున్నాడు.

కాని ఆధునిక అమెరికాలో యోగిని అన్వేషించటం - చేయటంకన్న చెప్పటం సులభతరం. అంటే స్వయంగా ప్రకటించుకున్న అభ్యర్థుల కొరత అక్కడ వుందనికాదు. నేను అటువంటి వాళ్ళను చాలామందిని చూచాను. అయినా అది ఎప్పుడూ సరియైందిగా కనబడలేదు. ప్రచారం ఎల్లప్పుడూ ఎంతో చాకచక్యంగా సాగుతుంది. వారాంతపు గోష్టులు ఎంతో వ్యయపూరితంగా వుండేవి. వారి చిన్న చిన్న సామ్రాజ్యాలను విస్తరింప జేసుకొనే తాపత్రయంతో, మన బోటి వారికున్నట్టి ఆశయాలతో, అవే ఆందోళనలు నిండిన కళ్ళతో ఆ పవిత్ర వ్యక్తులే వున్నారు. ఒక ప్రసిద్ధ భారతీయ సాధువు చేసిన తీవ్రప్రసంగం నాకు గుర్తుంది. ఉద్రిక్తమైన ఉచ్చైస్వరంతో ఆయన ఉపన్యసిస్తున్నప్పుడు ఆ డేగ కళ్ళు సభాకంపంతో చుట్టూరా కదలాడాయి. ప్రసంగం జరిగిన తరువాత యోగి అనుయాయులలో ఒకరు నా దగ్గరకు వచ్చారు. నేను ఆయన గురించి ఏమి అనుకుంటు న్నానో అడిగారు. నిర్మొహమాటంగా "ఆయన అశాంతిగా, అస్థిరంగా వున్నట్టున్నారు" అని నేను ప్రత్యుత్తరమిచ్చాను. "పవిత్రులు ప్రసరించే నిబ్బరమైన శాంతి ఏది" అని అడిగాను. "మీరు పూర్తిగా పొరబడ్డారు. అది శాంతరాహిత్యం కాదు - శక్తి - దైవబలం" అని నాకు నచ్చ జెప్పారు. ప్రసంగించే సమయంలోనే మైకంతో గొంతు అస్పష్టమయ్యేదాకా సారా తాగటం అలవాటున్న ఇంకొక

ప్రసిద్ధ ఆధ్యాత్మిక బోధకుని విషయంలో సాధారణమైన సాంఘిక కట్టుబాట్ల నుంచి ఆయనకు గల స్వేచ్ఛను ఆయన ప్రదర్శిస్తున్నాడని నాకు వివరించబడింది. ఇంకో ప్రఖ్యాత గురువు యొక్క శిష్యుడు తమ గురువుగారికి యువక స్త్రీ అనుయాయుల పట్ల గల మోహాన్ని, వారిపట్ల ఆయనకు గల కరుణకు సంకేతంగా చిత్రీకరించాడు.

ఎప్పుడూ అక్కడ సంజాయిషీలున్నాయి. కానీ ఏదీ? యోగానంద అంత సుందరంగా వర్ణించిన పవిత్రత? గంభీరశాంతి? ప్రకాశించే ప్రేమాఏది? అది అతిసులువుగా ఎగుమతి చేయ వీలులేని సున్నితమైన ఫలం వంటిదేమో బహుశ. భారతదేశానికి ఉన్ముఖమవటంకన్నా చేయటాని కేమీ మిగిలినట్లు కనబడలేదు.

* * *

భారత - నేపాల్ దేశాలగుండా సంవత్సరం పాటు జరిగిన నా పర్యటన - నా యాత్ర వివరాలు ఇక్కడ అంతగా సందర్భించినవి కావు. దేనిని నేను చాలా కాలంగా అన్వేషిస్తున్నానో, దానిని ఎక్కడ పొందానో ఆ జిల్లెళ్ళ మూడికి నా అన్వేషణ దారి తీసిందని మాత్రం చెప్తేచాలు. నేను దేనిని వెదుకుతున్నట్లు భావించానో దానికన్న కొంచెం తక్కువగానూ, అదే క్షణంలో కొంచెం ఎక్కువగానూ నేన క్కడ కనుగొన్న వస్తువు వుంది. అమ్మ సంపూర్ణంగా మానవతతో మనిషిగానూ, సమీపించ గలిగినట్లుగానూ

వున్నది. ఒక విధంగా భావిస్తే అమ్మ ఇంకొంచెం ఎడంగా ఇంకొంచెం భక్తితో కూడిన భయాన్ని పుట్టిస్తూ వుండటం నేను కోరుకొనేవాడిని. డమాస్కస్‌కి చెందిన సాల్‌వలే నా అడుగులలో నేను భయంతో కూల బడేట్లుగా కొట్టబడటం ఇష్టపడివుండేవాణ్ణి. నేనే అమ్మ పాత్ర చిత్రించ వలసివస్తే అమ్మను మరింత భయభక్తులు కలిగించేదిగానూ, నాటకీయంగానూ చిత్రించి వుండే వాడిని. దానికి మించిన సౌమ్యంగా తక్కువ నాటకీయంగా వాస్తవానికి జరిగింది.

అమ్మతో వర్థిల్లిన సంబంధం నేను ముందుగా తలచిన దానికి పూర్తిగా భిన్నంగా వుంది. నీ చేతిని పట్టుకొని జీవితం ఎలాగడపాలో, ఒక సాధన ఎలా అభ్యాసం చేయాలో వివరంగా ఎవరు చేప్తారో వారే గురువు. ఏ విషయమైనా కానీ నేను ఆరకంగా దానిని రూపుకట్టుకునే వరకు వచ్చాను. ఈ అభిప్రాయాన్నే పాశ్చాత్య దేశాలలో ఈ రకంగా నాకు బోధింపబడింది. ఒక చేతిలో రెంచి పట్టుకొని యంత్ర సామాగ్రిని మరమ్మత్తు చేసే మహిమాన్వితుడైన స్వయం చోదక ఆత్మశిల్పివలె - నిస్సందేహంగా అనుభవమే ఆధారంగా జీవించే అమెరికా ప్రజలమైన మేము మా గురువును అపేక్షిస్తాము. మూడుసంవత్సరాలకుపైగా జిల్లెళ్ళమూడిలో గడిపిన నేను ఇంకా రెంచిని చూడవలసే వుందని నిజంగా అంగీకరించాలి. 'కాఫీతాగు', 'వెళ్ళి అన్నం తిను', 'దిగులు

పడకు', అనే మాటలకు మించిన గంభీరమైన ఆధ్యాత్మిక సూచనలు ఇంకా వినవలసే వున్నది. అక్కడ మార్గదర్శకత్వంలేదని చెప్పటంకాదు, నేను అపేక్షించడానికి దారితీయబడినట్లుగా కాక వచ్చిన మార్గదర్శకత్వం మరింత సూక్ష్మంగానూ అంతర్ముఖంగానూ వుంది. నేను నిర్ధారింప గలిగినంత వరకు ముందుగా రూపొందించుకొన్న ఒక నమూనాకు ఎవరినీ మలిచే ప్రయత్నం అమ్మ చేయదు. అమ్మ కేవలం ప్రతి వ్యక్తి యొక్క యథారూపాన్ని అతని పైపే ప్రతిబింబించెటట్లు చేస్తుంది. ఆ వ్యక్తి సహజమానసిక శక్తులకు అవసరమైన మరమ్మత్తులని వదులుతుంది.

ఒక అమెరికా యువతి అమ్మదగ్గరకు వచ్చి ఆమె ఎలా బద్ధకంగా ఆనందం లేకుండా వున్నదీ, తన చుట్టూ వున్నంత మాత్రానికే తాను ఎలా ఇతరులకు హాయి లేకుండా చేసిందీ మొదలైన తన సమస్యల గురించి అమ్మకు విన్నవించుకున్న విధానం నాకు గుర్తుంది. పెట్రోలు బంకు దగ్గరున్న పెట్రోలు కొట్టేవాడికి ఇంజనులో నుంచి పెద్ద మోత వస్తున్నదని, వేగాభివృద్ధిలో ఇబ్బంది వుందనీ, హెడ్‌లైట్ వదులుగా వుందనీ ఇలా ఎన్నోన్నో ఏకరువు పెట్టే విధంగా తన బలహీనతలను గురించి వాస్తవమా? అనిపించే రీతిలో ఆమె చెప్పుకుపోతూనే వుంది. భయంకరంగా తోచే ఆ సమస్యల పట్టి ముగిసినాక అమ్మ చెప్పబోయే రోగ నిదానం

కోసం ఆమె అమ్మవైపు తిరిగింది. కొన్ని క్షణాలు అమ్మ ఆ యువతివైపు తేరిపార చూచి ఈ విధంగా అంటూ అనువాదకుని దిశకు తిరిగింది. "సమస్య ఆమెకు అర్థం కాలేదని చెప్పు. రోగం ఏమిటో నీకు అర్థమైనపుడు అది నయమయ్యే విధానం కూడా నీకు తెలుస్తుంది. ఇక్కడ కొంతకాలం నువ్వు ఎందుకు వుండకూడదు?" అమ్మ ఏమీ చేయదు. కాని ఒకరకంగా నాలాగా ఇక్కడ కొంతకాలం నిలబడ్డవారికి సమస్యయొక్క నిజస్వభావంపట్ల అవగాహన వృద్ధిపొందుతూ వుంటుంది. తత్ఫలితంగా వారు మనశ్శాంతి అనుభవిస్తారు.

ఆ యువతి స్వయంగా అవగాహన చేసుకోనే సమస్య యొక్క నిజస్వభావం అమ్మస్పష్టంగా చెప్పనప్పటికీ నా అనుభవం ద్వారా నేనూహించగలను. ఆమె జిల్లెళ్ళమూడిలో వుండినట్లైతే తన సమస్య నిజంగా తాను ఏకరువు పెట్టిన యాంత్రికమైన వ్యక్తిత్వపు వైఫల్యాలలో అంతగా లేదని, తననుతాను - తప్పులు దోషాలు అన్నింటితోసహా సమ్మతిం చేందుకు వున్న అశక్తతలో వుందని క్రమంగా ఆమెకు కనువిప్పు అయ్యేది.

అమ్మ ధ్వనిస్తూన్న సరియైన అవగాహన అదే. రాగద్వేషాలకు సంబంధించిన ఆవేశపూరిత ప్రతిక్రియలు లేకుండా మనల్ని మనం కనికరంతో చూచుకోవటం మనకు

చేతనయ్యేంతదాకా ఆ యెరుక వుదయించటం ఆరంభంకాదు. ఇక తుది ఫలితమేమంటే మన లక్షణాలను మంచి అని చెడు అని నిర్ణయించే ఈ వైఖరి సమస్య నిజ స్వభావంపట్ల స్వచ్ఛమైన అవగాహనపొందే అవకాశాన్ని అడ్డగిస్తుంది. పై పెచ్చు తనను తాను మంచి-చెడు, నలుపు-తెలుపు అనే గీటురాయితో చూడాలనే మూఢత్వం ఆధ్యాత్మిక వివక్ష అనే ముసుగులో చెలామణీ అవుతుంది. మనం చెడుగా, అనాధ్యాత్మికంగా వున్నామని, బలవంతంగా ఆదర్శానికి అనుగుణంగా వుండాలని మనకు మనం చెప్పుకుంటాం. ఈ అసహనవైఖరి సమస్యకు పరిష్కారం కాకపోగా నిజంగా అది రోగ లక్షణమే అవుతుంది. ఇట్టి సందర్భాలలో ఒక యోగితోగల సుదీర్ఘబాంధవ్యం మనకందించే అచ్చెరువు గొలిపే మొట్టమొదటి కిటుకేమిటంటే భీతిగొలిపే రీతిలో మనల్ని మనం వివక్షతతో (మంచిఅని చెడుఅనీ) చూసుకోవడం ఆధ్యాత్మికంగా అనుచితమని. మన అనాత్మిక భాగాలతో మనంచేసే పోరాటంలో గురువు మనకు సహాయకుడౌతాడని సహజంగా అపేక్షిస్తూ ఆయన దగ్గరకు వచ్చాం. దానికి బదులు గురువుని పక్షపాతంలేని సాక్షిగా మనం కనుగొంటాం. మనల్ని సంస్కరించడానికి ఉత్సాహంతో ప్రయత్నించడంకాక మనలోని మంచి చెడులను, తీర్పు ఇవ్వకుండా సమానంగా కేవలం వెనుకకి ప్రతిఫలింపచేస్తాడు.

అమ్మతో నా స్వానుభవమిది. నన్ను నేనెరిగిన దాని కన్న మిన్నగా ఎరిగిన ఒకానొకరు ఇక్కడ వున్నారని నేను వెంటనే గుర్తించటం జరిగింది. ఏరకమైన నటన అయినా ఆమె దగ్గర సాగేందుకు అవకాశం లేశమాత్రమూ లేదు. ఒకరు చేసే చేతల, మాటల బాహ్యమైన అర్థానికి కాకుండా, వాని లోపలివుద్దేశానికి స్పందించే ఆశ్చర్య కరమైన, కలవరపరచే గుణం అమ్మ కలిగివుంది. ప్రతి కోణంలోనుంచి నేను ఆమెకు తెరచిన పుస్తకమేనని తేట తెల్లమైంది. అదే సమయంలో నేను మారాలనే ఆదేశపు ఛాయగానీ, అరమరికల నీడగానీ లేశమాత్రం లేకుండా నన్నింతకు మునుపెవరూ అంత పూర్తిగా స్వీకరించలేదు. మొదట్లో నాకది అగమ్యగోచరంగా వుండేది. ఆ ప్రేమ అపాత్రమైనట్లు తోచేది. అమ్మ యొక్క క్షమాసహనాలు అనివార్యంగా నన్ను పామటం మొదలుపెట్టాయి. అంతా తెలిసిన తానే నన్ను యథాతథంగా స్వీకరించగలిగినప్పుడు నన్ను నేను మరికొంచెం సన్మతించలేనా ?

ఖాయంగా అమ్మతో సాంగత్యం నా వ్యక్తిగత బలహీనతలపట్ల నాలో ఎంతో ఉపశమనం తెచ్చింది. అద్దం పూర్తిగా నిష్పక్షపాతంగా వుంది. అమ్మ యొక్క అభయ ప్రదాయకమైన ప్రేమాదరాలు వున్నాయనే యెరుక నా లోపాలను గూర్చిన అవగాహన వల్ల కలిగే భయానికి లోనుగాకుండా అవసరమైన భద్రతా భావన కల్గించింది.

కోపం లేకుండా, సంస్కరించాలనే తొందరలేకుండా వాటిని నిష్పక్షపాతంగా మొట్టమొదటి సారిగా చూచేందుకు ఒక చోటుంది.

ఐహిక పారమార్థిక విషయాల పట్ల నా వైఖరిలోగల సరసతలేని దీక్షాభావాన్ని అమ్మ బహుముఖాలుగా ఎన్నో సార్లు ఖండిస్తూ వచ్చింది. బిఱ్ఱుగా, ఒక రకమైన నిర్బంధ సరళిలో నేను అమ్మకు గాలి విసరుతున్న ప్రత్యేకమైన సందర్భం నాకు గుర్తుంది. అమ్మ నావైపు తిరిగి సైనికో చ్చారణవలె కరకుగా "డ్యూటీ" అనే ఒకే ఒక్క ఇంగ్లీషు పదం ఉచ్చరించింది. ప్రతి ఒక్కరూ పుంచితనంతో నవ్వారు. నేనుకూడా నవ్వటం కన్నా ఏమీ చేయలేక పోయాను. ఒక్క పదంతో ఎంత బాగా అమ్మ నన్ను నిలదీసింది ? బడిలో, పరస్పర వ్యక్తిగత సంబంధాలలో, మరి ఇపుడు పారమార్థిక జీవనంలో కూడా నా జీవితమంతా నన్ను నేను తరుముకున్నాను. నా స్కూలులో విద్యార్థి పాలనలో పాల్గొంటూ, న్యూయార్క్ రేడియో కేంద్రంలో వారం వారం వచ్చే ఇంటర్వ్యూ ప్రోగ్రాంలో సమీక్షకుడుగా వుంటూ, స్థానిక దూరదర్శన ప్రదర్శనల్లో వ్యాఖ్యాతగా కనబడుతూ బాలునిగానే, తీవ్ర కృషి, బాధ్యతలతో కూడిన పెద్దరికపు ప్రపంచంలోనికి ప్రవేశించాలని అకాలంగానే ఆదుర్దాపడ్డాను. 20వ పడిలో పడకుండానే పెద్దవాళ్ళ ప్రపంచంలో ఎవరైనా సాధింపదగినదని ఎంచబడిన గెలుపు

యొక్క బాహ్యలక్షణాలను అనుభవించాను. అయినా అదంతా శుష్కంగానూ, వృధాగానూ కన్పించింది. చిత్త శుద్ధితో త్యాగం చెయ్యబడిన యౌవన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను ఆ లక్ష్యంకోసం పణంగా పెట్టాను.

నా గడియారాన్ని వెనక్కు తిప్పమని, విషయాలపై నాకుగల నిర్బంధ వైఖరిని సడలించమని నన్ను నేను తగ్గిన తీవ్రతతో స్వీకరించమని మరొకసారి పసిపాపవలె, బహుశ మొట్టమొదటి సారిగా పసిపాపవలె వుండమని అమ్మ ఇపుడు బుజ్జగిస్తూ చెపుతోంది, ఇక్కడ మీరు సాధించిన ఘనకార్యాలతోగానీ, బిరుదులతోగానీ, ఎంత బలంగా విసనక్రతో విసురుతున్నావనే దానితోగానీ, ఎంత బాగా ధ్యానం చేస్తున్నావనే విషయంతోగానీ మీ సామర్థ్యాన్ని మీరు నిరూపించుకోవలసిన అవసరం లేదని అమ్మ చెప్తున్నట్లనిపించింది.

* * *

చాలావరకూ ఈ సందేశం అవాచ్యంగానే మిగిపోయింది. అయినా కొన్ని సందర్భాలలో అమ్మ చాలా స్పష్టంగా వుండగలదు. ఒకసారి నేను కొంత కలతతో వ్యక్తిగతమైన బాధ్యతగా భావిస్తున్న సంస్థాగత విషయాలు చర్చిస్తున్నపుడు అమ్మ తన వ్యాకులతను స్పష్టంగా వ్యక్తం చేసింది. "అటువంటి సంగతులను గురించి నువ్వు

ఆదుర్దా పడటం నేను కోరుకోను". అమ్మ గొంతులో మాతృత్వపు అభ్యంతరం మిళితమయ్యే తీరులో అమ్మ చెప్పింది. "అమ్మ పాదాల దగ్గర కలతలూ, బాధ్యతలూ లేకుండా, పసిపాపలా ఆడుకోవటం నీనుంచి నేనుకోరుతాను. పసిపాప అని అనటం కూడా సరిపోదు. ఇక్కడ అప్పుడే పుట్టిన బిడ్డగాని నీవనుకోవటం నేనాశిస్తాను".

తన పారమార్థిక సంతతికోసం అమ్మ విధించిన సాధన ఏమిటని ఎప్పుడైనా ప్రశ్న ఉదయించినప్పుడు అమ్మ మందలింపుని తిరిగి గుర్తుకు తెచ్చుకుంటాను. జిల్లెళ్ళ మూడిలో సాధన అంటే తిరిగి శిశువుకావటం: అమ్మ దగ్గర నివసించే వారందరికీ అది అయత్నంగా సంభవించేది కాబట్టి దానిని సాధన అని పిలవటం ఖచ్చితంగా సరియైనది కాదనుకోండి. కేవలం అమ్మ సాన్నిధ్యంలో వుండటం వల్లనే మనలో దాగిన శిశువు బయట పడుతుందని అనుమానించేట్టుగా అమ్మజుట్టు నిమురుతూండగా, అమ్మవడిలో భద్రంగా ముడుచుకుపోయే ముడతలు పడ్డ తాతమ్మలను, తాతయ్యలను నేను చాలామందిని చూసాను. "నా కెవరూ శిష్యులు లేరు. అందరూ నాకు శిశువులే" అనే పునరుద్ఘాటనలోనే అమ్మ స్వీయ దృక్పథం గొప్పగా సంగ్రహింపబడింది.

అమ్మ దగ్గరకు వచ్చిన వారిలో చాలామంది ఈ

సందర్భాన్ని ఒక రకమైన రెండవ జన్మగా సంభావిస్తారు. భౌతికంగా ఘనకార్యాలతో గొప్పగా విజయవంతమైన జీవితం సాగించి ఉద్యోగ విరమణ చేసిన చురుకైన వ్యక్తి ఒకరు తాను కుటుంబాన్ని అభివృద్ధికి తేవటం కానీ, ఉద్యోగంలో అత్యున్నత పదవిని అధిరోహించటం కానీ, సహచరుల నుండి మన్ననల నందుకోవటం కానీ ఇవేవీ 'తాను జిల్లెళ్ళమూడికి రావటం' అనే సామాన్య వాస్తవంతో పోల్చదగినవి కావని నాకెంతో నమ్మకంగా చెప్పాడు. తనకు సంబంధించినంత వరకు ఆరోజునుండే అతని జీవితం ప్రారంభమైంది.

ఆయన అభిప్రాయపడింది గమనించటం తేలిక. దర్శనానికి నేను కూర్చున్న ప్రతిసారి అద్భుతంగా, పునరుజ్జీవనం పొందినట్లు నాకు నేనే భావించాను. అటువంటి సమయాల్లో, చిన్నతనం నుండి నేను అనుభవించని అమాయకత, సరళ నిష్కపట ప్రేమలకు చెందిన భావనలు ఉబుకుతుండేవి. పాత జ్ఞాపకాలు కదిలేవి. సంవత్సరాలుగా కూరుకుపోయిన ఆపేక్షలూ, సంతోషాలూ తిరిగి తలెత్తేవి. ఆ దర్శనంలో అమ్మలోని నిర్మలత్వానికి చెందినదేదో, దానిని పొందగల నిద్రాణమైన నాలోని సామర్థ్యంతో ప్రతిధ్వనిస్తున్నట్లు, ప్రాణంపోసి దానిని అనూహ్యంగా మేల్కొల్పుతున్నదా అన్నట్లుండేది.

నాలో ఒక స్వరం జనించడానికి నెమ్మదిగా పెనుగు

లాడుతోంది. అది ఒక శిశు స్వరం. కృతజ్ఞతకు, భక్తికీ అన్నిటికన్న మిన్నగా ప్రార్థనకూ చెందిన స్వరం. ఈ సుతి మెత్తని అంతర్వాణితో పూర్తిగా, హాయిగా ఉండడానికి నేనింకా అనుమాన గ్రస్తుడనైన పాశ్చాత్యుడనయ్యే వున్నాను. ఆ భావనను ఇంకెంత మాత్రం అణచుకోవాలనుకోలేదు. అదేనాకు అమ్మతోగల ప్రత్యక్ష సంబంధం. నేను అమ్మను తెలుగులో సంబోధించలేను కనుక, (ఒకవేళ నాకు సాధ్యమైనాకూడా నేను భావిస్తున్న విషయం చెప్పటానికి తప్పనిసరిగా ఇబ్బందిపడివుండేవాణ్ణి.) మాటలు లేకుండా హృదయంద్వారా నేను అమ్మతో మాట్లాడాను. ఎంతో ఉత్కంఠ కల్గించే విధంగా అమ్మ ప్రతిస్పందించేది. ఒక్కొక్కసారి అమ్మ సమాధానం అంతర్గతమైన సహజప్రేరణతో నేనూహించేవాడిని. కానీ తరచూ అమ్మ జవాబు ఆశ్చర్యకరంగానూ, బహిర్గతంగానూ, సూటిగానూ ఉండేది.

అమ్మ సాన్నిధ్యంలో, నేనొక భక్త సమూహంలో కూర్చొని వుండగా వున్నట్లుండి అప్రయత్నంగా ఒక కృతజ్ఞతా తరంగం, అంతరంగపు లోతునుండి ఏదో ఒక ఆరాధన, క్షణకాలంపాటు ఒక జ్ఞాన ప్రకాశంలో నుండి వెల్లుబుకేది. వెనువెంటనే సమ్మతిని సూచించే మందస్మితంతోనో, అవగాహనగల జాలిచూపుతోనో అమ్మ నన్ను సూటిగా తేరిపార చూస్తూండేది. రోజుల తరబడీ అర్థరహితమైన

అంతరంగంతో నేనున్నప్పుడు నావంక చూడడం కూడా అమ్మ ఖచ్చితంగా తప్పుకుంటున్నట్లుగా తోచేది. అప్పుడు మనఃపూర్వకంగా వెళ్ళబోసుకునే క్షణంలో గూడుగట్టుకున్న ఆవేదనలు కట్టలు త్రెంచుకొనేవి. అంతర్గతంగా 'అమ్మా!' అని ఎలుగెత్తి పిలుస్తున్న నన్ను నేను చూసుకునే వాడిని. నాకు తెలిసిన తరువాతి విషయం ఏమిటంటే పూర్తి అవగాహన కల్గిన దృష్టితో మాతృత్వం ఉట్టిపడేటట్లు అమ్మ తొంగి చూస్తుండేది. కేనడా నుండి వచ్చిన యాత్రికునితో పాటు అమ్మగదిలో కూర్చొని, అమ్మ దీవెనలు పొందాలని అతడు తెచ్చుకొన్న చిన్న బైబిలు,పుస్తకం పేజీలు నేను తిరగేస్తూండటం నాకు గుర్తుంది. మనం ఒక క్రైస్తు సాన్నిధ్యంలో కూర్చున్నామని, తన జీవితవృత్తాంతాన్ని ఆశీర్వదించమని ఆ క్రీస్తుప్రభువునే అడుగుతున్నామని అకస్మాత్తుగా నాకనిపించింది ఆ క్షణంలో గోడవైపు తిరిగి మాకు ఆవలి దిక్కు ముఖంగా మంచంమీద పడుకొని వున్న అమ్మ మెడ పూర్తిగా మా దిశకు త్రిప్పి, అసామాన్యమైన, అసౌకర్యకరమైన ఆ స్థితిలోకొన్ని క్షణాలువుండి నాకళ్ళలోకి తీక్ష్ణంగా తేరిపారచూచింది. ఆమె నిశ్శబ్దంగానే వుండిపోయింది. అయినా ఆమె చెప్పివుండేదేదీ ఆనిశ్చల దృష్టివలె అనర్గళంగా వుండగలిగేదికాదు.

మొదట్లో అటువంటి సంఘటనలు జరిగినపుడు అది కేవలం కాకతాళీయం కాదుకదా? అని అచ్చెరువొందటం

గమనించాను. కానీ ఇటు వంటి కాకతాళీయత అంతులే కుండా పునరావృతమైతే ఆ కోవకు అది చెందదు. ఏదేమైనా ఇటువంటి అనుభవాలు నా కొక్కడికే కలగటం లేదని నేను కనుగొన్నాను. నిజానికి భక్తులు ఈ సంఘటనలను సర్వ సాధారణమైనవిగా భావిస్తారు. తమ అంతర్యమైన ఆలోచన లను, భావాలను అమ్మ బహిరంగంగా వర్ణించటంతో తెలుగు వారికి తరచూ ఇది ఇంకా స్పష్టంగా కన్పించేది. కనీసం తన భక్తుల జీవితాలకు, ఆలోచనలకు సంబంధించినంత వరకు అమ్మ 'సర్వజ్ఞ' అనే బాగా వ్యాప్తి చెందిన దృక్ప ధంతో ఏకీభవించటం పెద్ద కష్టమేమీ కాదు.

ఈ అనుభవాలు అమ్మ చైతన్యసీమను వూహించేం దుకు దారి తీస్తాయి. తన చుట్టూ వున్న వారిలోని పరమ సూక్ష్మమైన మానసిక పారమార్థిక స్రవంతులతో తనను సహానుభూతితో శ్రుతి చేసుకొని వుండగలిగిన ఒకానొకరు అహంకారంతో చుట్టబడిన, మన మనుగడకు ప్రధాన విషయ మైన శరీరము, ఆలోచనలు, భావాలతో అనితరమైన తాదాత్మ్యస్థితిని ఒకానొక మూలాధారమైన స్థాయిలో తప్పని సరిగా అధిగమించి వుండాలి. నీవలె, నావలె అమ్మ మానవ మాత్రురాలు కాదని, మానవరూపంతో ప్రత్యక్షమౌతున్న దైవమని, అమ్మ ఒక అవతారమని చెప్పటానికి భక్తులు మక్కువపడతారు. అమ్మను 'భగవంతుడు' అని అంటున్న ప్పుడు వాస్తవానికి మనం చెప్పిందేమిటి ? మనం రహ

స్యాన్ని పరిష్కరించామా! లేక నిజతాత్పర్యం ఏ విధం గానూ తెలియని మనం దానికి మరో పేరు పెట్టామా? తనను విశదపరచుకునేందుకు అమ్మ అవతారం అనే పదాన్ని ఎప్పుడూ వాడదు. అమ్మ ఏదైనా మాట్లాడితే తన అనుభవంలోని వాస్తవాన్ని వివరించటానికి తప్ప తన స్థితిని నిర్వచించే ప్రయత్నంగా కాని, ఒక పేరు తగిలించుకొనేందుకుగా కానీ మాట్లాడదు. "నేనెప్పుడూ ఒంటరిగాలేను, అందరూ నాలోనేవున్నారు. నేనందరి యెరుకతోనేవున్నాను వ్యక్తులు – సంఘటనలు – అనేకత్వం – అంతా. నా మనసులో ప్రపంచం మొత్తాన్ని తిరగేస్తున్నాను. నా ఒక్క మనసే అనేకం అయిందని అనుకొంటూ వున్నాను. అందుకే నేను అందరూ, అంతా అయ్యాను' అంటున్నాను. నేనెన్నడూ ఒంటరిగాలేను. అందరిలోనూ నా పాలు వున్నది".

* * *

విశ్వంతోగల ఈ తాదాత్మ్య స్థితిని భారతీయ యోగ పరిభాషలో 'సమాధి' అని వ్యవహరిస్తారు. సమాధికి అనేక స్థాయిలున్నాయి. వానిలో చాలామటుకు అంత ఉన్నతమైనవికావు. కాని ప్రతి చోటా చిట్టచివరి స్థితిమా తం పరిమితులు అంతరించిన చైతన్యంగా అభివర్ణింపబడింది. అన్నింటికీ అంతర్గతంగా ఉన్న నిర్మలమైన ఎరుక ఎవరిమటుకు వారికి అనుభవంగా దానంతట అదివస్తుంది. సాధారణంగా ధ్యానం అభ్యసించే తరుణంలో మాత్రమే సాధ్యమయే

స్థితిగా దీనిని భావిస్తారు. యుగాల తరబడి, అసంఖ్యాకు లయిన సాధకులు సమాధి పరమసీమను సాధించేందుకు ప్రయత్నించారు. కానీ దానిని పొందటంలో అడ్డంకులు ఎంతో ప్రబలంగా ఉంటాయంటారు. అందు వల్ల ఏ కొద్ది మందో మాత్రమే వాస్తవానికి వారి అభిమాన గమ్యాన్ని చేరుకోగలిగారని చెప్పబడుతుంది. నేటి భారతంలో సంకల్ప మాత్రం చేత సమాధిగతులు కాగలరని విస్తృతంగా అంగీక రింపబడిన కొద్దిమంది యోగులు ఇంకా జీవించి ఉన్నారు

ఉదాహరణకు ముమ్మిడివరం బాలయోగి ఉన్నారు. జిల్లెళ్ళమూడి ఉన్న ఆంధ్రప్రదేశ్ తీరప్రాంతంలో, చెప్ప నలవికాని, లక్షలాదిప్రజలకు, సజీవ ఐతిహ్యంగా ఉన్న మహిమాన్వితుడయిన యోగి ఆయన. ఆహారమూ, స్వచ్ఛ మైన గాలీ, నీరూ లేకుండా సీలువేయబడిన గుడి గదిలో సంవత్సరం పొడుగునా ఈ యోగి ఉంటారు. సంవత్స రానికి ఒకసారివచ్చే మహా శివరాత్రి ఉత్సవం నాడు బయటనుంచి ఆయనగది తాళం తీయబడుతుంది. తన దర్శనభాగ్యంకోసం వచ్చే, తరుచు లక్షకుమించే గొప్ప భక్తజనసందోహం ముందు ఒక రోజు అంతా నిశ్చలంగా కూర్చుంటారు. వచ్చిన అందరూ బారులు తీరి ప్రక్కనుంచి కొద్దిసేపు చూచి దాటి వెళ్ళిన తర్వాత, ఇంకో సంవత్సరం నిరాటంకమైన ధ్యానం కోసం స్వచ్ఛంద నిర్బంధంలోకి పునఃప్రవేశిస్తారు.



అలంకార హైమ

ఇటువంటి వ్యక్తిత్వం ఉన్న యోగులు అరుదుగా ఉంటారు. ఉన్న ఏకొద్దిపాటిమందో, వారి జీవితాలలో చాలా భాగం ప్రజలదృష్టినుండి దూరంగా పర్వతగుహలలోనో, అరణ్యాశ్రమాలలోనో ఉంటారనేది ఖాయమైన విషయం. భారతదేశంలో ఈ ఏకాంతధ్యానమగ్నులయిన యోగులు అత్యున్నత గౌరవాదరాలను, భక్తిప్రపత్తులను పొందే మూర్తిమంతులయి ఉంటారు. చపలచిత్తంమీద, వ్యామోహాలమీద వారిగెలుపు మానవుడు అభిలషింప దగిన అత్యున్నత విజయం. నేను జీవించిన దక్షిణ భారతంలో లక్షలాది హిందువులకు వారి చైతన్యాన్నిగూర్చిన ప్రాచీనశాస్త్ర సత్యాలు నిజమని తెలియచెప్పేందుకు బాలయోగి ఉనికి ప్రబలమైన ప్రత్యక్ష నిదర్శనం. శంకాకులమైన మన అధునాతన యుగంలో మనచైతన్య పరిధులను మించిన ఉన్నత చైతన్యసీమ ఉన్నది అనటానికి బాలయోగి సజీవ నిదర్శనం.

యోగం బహుశాకొన్ని జీవితకాలాల పాటు కొనసాగే క్రమారోహణం. ఉన్నత శిఖరాన్ని జయించే ముందు అధిగమించవలసిన వివిధ సీమలు, మైదానాలు ఉన్నాయి. ఒకొక్కసారి సంవత్సరాల తరబడి సమాధిలోని ఒక అనూహ్యమైన స్థితిలో బంధించుకుని ఉండగలిగిన అముష్మిక మహితాత్ములు కూడా ఆధ్యాత్మిక వికాసపు అంతిమ

సీమను పొంది ఉండకపోవచ్చు. నిజానికి అన్ని వస్తువుల తోను తన ఏకత్వదార్శనికత నిలబెట్టుకునేందుకు ఒక ప్రత్యేకమైన ధ్యానవిధానం మీద ఆశ్రితుడయినంత కాలం అతను పథ గమ్యాన్ని చేరుకున్నట్లు భావించటానికి సాధ్య పడదు. ఆ ఎరుక అయత్నమయినప్పుడే, ధ్యానంలో ఉన్నరీతిగా, సాధారణ జీవన కార్యక్రమాలలోనూ సమంగా ఆ ఎరుక అలాగే ఉన్నప్పుడే, నిజమైన యోగ గమ్యమైన పూర్ణ ముక్తి పొందాడని చెప్పడానికి కుదురుతుంది. ఆ తరుణంలో యోగి సమాధిగతుడై పద్మాసనంలో కూర్చు న్నాడా, విహరిస్తున్నాడా, తింటున్నాడా, నిద్రిస్తున్నాడా అన్నది అప్రస్తుతం. అందుబాటులో లేని హిమాలయాల విస్తారంలో ఉన్నాడా ? క్రిక్కిరిసిన నగరంలో నివసిస్తు న్నాడా అన్నది సంగతమైన దెంతమాత్రమూకాదు. అన్ని అనుభవాలు, అన్నిస్థలాలు వానికి స్ఫటిక సదృశంగా, నిర్మలంగా వుంటాయి. ప్రతిదీ సమానంగా ఒకే దేవుని వెలుగుని, పరమసత్యకాంతిని ప్రసరిస్తుంది. ఈ స్థితికి ఒక సంస్కృత పదం వుంది. అది 'సహజ సమాధ' అని. సమాధి సహజమూ, అప్రయత్నమూ, శాశ్వతము అవు తుంది. అత్యంత అపురూపమైన ఆస్థితి ఏకొద్దిమంది ఉన్నత శ్రేణిసాధకులకో తప్ప మిగిలిన వారి భావనకు అతీతంగా వుంటుంది. కానీ ఒక మోస్తరుగా అమ్మ దాని మాయను పోగొటేందుకు ప్రయత్నించింది. అందుకో గలిగే దానివలె,

అంత భయం రేకెత్తించని దానివలె కనబడేటట్లు చేసింది. దానిని అమ్మ 'సహజస్థితి' అంటూ మనలోని ప్రతి ఒక్కరిలోనూ అంతర్గతంగా వున్న యెరుకే అది అంటుంది. నా దృష్టిలో ఎవరికీ వివిధమైన వేర్వేరు పారమార్థిక అనుభవాలు వుండవు. సర్వకాల సర్వావస్థలలోనూ యెడతెగకుండా, 'అంతా ఒకటే'నన్న శాశ్వత సత్యావిష్కారమే నిజమైన అనుభవం.

ఇదే తాను అలవాటుపడిన చైతన్యస్థితియని అమ్మ స్వయంగా అభివర్ణించింది. (మాటలు మనల్ని తీసుకొనిపోగలిగినంత సమీపంగా) దాని అర్థం మనం మననం చేసినపుడు అది వున్నతమూ, ఎంతో అరుదూ అవుతుంది. కాని దానిని పూర్తిగా సాధారణమైన విషయంగా అమ్మ మనచేత దర్శింపచేస్తుంది. "మీరు కానిది నేనేదీకాదు" అని ప్రేమారా నొక్కిచెప్తుంది. అగ్నిశిఖ మాతృత్వపు సఖ్యత అనే తెరతో మూయబడింది. ఆ క్షణం వరకైనా కనీసం మనం వంచింపబడ్డాం. తెర పలుచనై దానిగుండా జ్యోతి వెలుపలకు ప్రకాశించే సందర్భాలు వున్నాయి. అప్పుడు అమ్మ చైతన్య సీమ యొక్క ప్రాభవం అకస్మాత్తుగా స్పష్టమౌతుంది. అమ్మ స్పృహలేని సమాధి స్థితిలో గంభీరంగా కూర్చుండగా చూచే సదవకాశమే చాలామంది భక్తులకు అమ్మ నిజప్రవృత్తిని క్షణకాలందర్శించే సందర్భమౌతుంది.

నేను అమ్మను ఈ స్థితిలో ఎప్పుడూ చూడలేదు కనుక అమ్మకు యథావిధిగా తాము పూజచేస్తున్న సమయాలలో వున్నట్లుండి సమాధిలోకి అమ్మ ఎలా జారిపోయేదో గుర్తుంచుకొన్న మొదట్లో వచ్చిన భక్తుల వివరణమీదనే ఆధారపడి తీరాలి. అమ్మలో అసాధారణమైన రూపాంతరం అయత్నంగా సంభవించేది. శరీరం బిగుసుకొనేది. చేతులు వెనువెంటనే హైందవ దేవతా విగ్రహాలలో చూడదగిన ప్రాచీన వరదాభయ ముద్రను దాల్చేవి. అదే సమయంలో అమ్మ శ్వాసస్థాయి తగ్గి భక్తులు అద్భుతావహంగా చూస్తూండంగా తరచూ ఆగిపోయేది. అన్నిరకాలుగా ఒక పొట్టి గ్రామీణ మహిళ స్వయంవేద్యమైన దైవంగా మారురూపం పొందటం జిల్లెళ్ళమూడి మొదట్లో వచ్చిన వారికి ఉత్తేజకరమైన అనుభవంగా వుండేది. ఆ తరువాత 1950 వ శతాబ్దం ఆదిలో ఈ సమాధి స్థితులు ఆగిపోవటం, ఆ తరువాత పూజ స్వీకరించే సమయాలలో అమ్మ సావధానంగా స్పృహతో వుండేది. ఈ సమాధి స్థితులు తన స్థితిని స్పష్టంగా ప్రదర్శించేందుకు వుద్దేశింపబడ్డాయని అమ్మ వివరిస్తుంది. సాధనగా ఎప్పుడూ వుద్దేశింపబడలేదు. చైతన్యపు అన్ని స్థితులలోనూ ఏకసూత్రంగా పరుగెత్తే అమ్మ ప్రధాన పారమార్థిక సాక్షాత్కారం మీద వాటి ప్రభావంలేదు. స్పష్టమూ, ప్రసన్నమూ అయిన అమ్మ పారమార్థికతకు చెందిన ఆవిష్కారం కోరుకునేవారికి ఈ సమాధి స్థితులు వుపయోగకరం. వాటి

ప్రయోజనం సిద్ధించిన తరువాత అవి సంభవించటం మాను కున్నాయి.

ప్రాణమున్న తోటిమనిషి రూపంలో దైవత్వాన్ని చూడటంకన్నా ఒకరాతిలో చూడటం సులభ తరమని అమ్మ వ్యంగ్యంగా ప్రేరేత్తి చూపుతుంది. పరిచయం చేయబడ కుండా ప్రాచీన జరూసెలం నగర వీధులలో క్రీస్తు ప్రభు వును కానీ, గ్రామీణ బీహారు ప్రాంతంలోగల గంగాతీరంలో గౌతమబుద్ధునిగానీ మనం కలుసుకోవడం జరిగితే, వారిలో కంటే - చెక్కిన, అచేతనమైన, ధ్యానమగ్నమైన బుద్ధ విగ్రహంలో కానీ స్వర్గదిశకు కళ్ళుత్రిప్పి శిలువపై మేకులతో బంధించిన క్రీస్తు విగ్రహంలోగానీ దైవాన్ని సులువుగా గుర్తిస్తాం. పరిణామ రాహిత్యాన్ని, ఒక పవిత్రతనూ, ఒకానొక భావ తీవ్రతనూ విగ్రహం మూర్తీభవించుకుంటుంది. కానీ వీటినన్నింటినీ జీవిత ప్రవాహమధ్యంలో గుర్తించడం అసంభవంగా వుంటుంది. మానవులు శిలావిగ్రహపు స్థితికి చాలా చేరువగా చేరుకొని నిశ్చలమైన ధ్యానస్థితి వహించి నపుడు వానిలోకూడా దైవత్వాన్ని గుర్తించటం చాలా సులభం.

అమ్మ ముచ్చటిస్తున్నప్పుడుగాని, దయార్ద్రమైన గృహిణిపాత్ర నిర్వహిస్తున్నప్పుడుగానీ, టీ అందిస్తున్న ప్పుడుగానీ, దర్శనార్థం వచ్చి తిరిగి వెళ్ళేవారికి కుంకుమ పొట్లాలు పంచుతున్నప్పుడుగానీ అమ్మపట్ల భయభక్తులు

కలగటం చాలా కష్టమని నేను గమనించాను. కానీ కొన్ని క్షణాల తరువాత, నిశ్చలంగా, మౌనంగా కూర్చున్నప్పుడు పూర్తిగా భిన్నమైన అవస్థ బహిర్గత మౌతుంది. ఎప్పుడూ వుండే సుహృద్భావమూ, సహజమందస్మితమూ అదృశ్య మౌతాయి. తెరచివున్న అంతర్ముఖమైన కళ్ళతో ఆలోచనా మగ్నమైన అమ్మ కనిపిస్తుంది. అమ్మ వైఖరిని చదవటం కష్టం. అప్పుడప్పుడావైఖరిలో లీలగా ఆపేక్షతోకూడిన జాలి గోచరమౌతుంది. అది తాను పోయిన చోటికి తన పిల్లలమైన మనం అనుసరించి పోలేకపోతున్నామే అన్న విచారంలో నుంచి వచ్చిన జాలి కావచ్చు. నిజమేమరి. ఒకానొక చైతన్యపు సాన్నిధ్యంలో దానిలోకి ప్రవేశింపలేక, దాన్ని పసిగడుతూ, విస్తారమూ, అగాధమూ అయిన ఏదో ఒకానొక వస్తువు అంచున మనం వున్నట్లు భావిస్తాం. భక్తకూటమిలో చాలా గంభీరమైన శాంతి ఆవహిస్తుంది. ఆలోచన లేని ప్రశ్నలతో, కోరికలతో అమ్మను కదిలించ రాదన్న అవాచ్య మైన అంగీకారం వారి మధ్య వుంటుంది.

గూఢమూ, స్పష్టమూ అయిన నిశ్శబ్దమది. 'శూన్యం' అని అర్థం వచ్చే నిశ్శబ్దం కాదది. మనల్ని శక్తివంతంగా మంత్ర ముగ్ధుల్ని చేసే సాన్నిధ్యమూ, పూర్ణత్వమూ అయిన నిశ్శబ్దమది. ఆసమయాలలో ధ్యానం సహజంగా కలుగుతుంది. మనస్సు అడ్డగించ బడలేనంతగా అంతర్ముఖ మౌతుంది.

వారధి కట్టలేని చైతన్యపు అగాధంవల్ల మన నుండి విడదీయబడి అమ్మ ఒక్కతే ఒంటరిగా ఉన్నట్లు కనిపించ వచ్చు. అందుకు విరుద్ధంగా ఇంత కంటే దగ్గరగా అమ్మ అంతకు ముందెపుడూలేదు. అమ్మ సందేశం ఇంత ఆర్ద్రంగా మరెప్పుడూ లేదు. ప్రపంచపు అంచున నిలబడినట్లు కన బడుతుంది. అయినా హద్దుదాటి అడుగు వేయదు. మన బాధలతో అమ్మను ముడి వేసినదారాన్ని సులువుగా త్రెంప గలదు. అయినప్పటికీ సుతిమెత్తనిదైన అనంత మైన విషాదంతో, అనంతమైన ప్రేమకు చెందిన అనంతమైన విషాదంతో స్పష్టంగా చలించిపోయి 'మనతోనే వుండిపోత ంది అమ్మ. ఇది ఎలా సంభవం? సుఖదుఃఖాల అధీనతకు అతీతంగావున్న ఒక వ్యక్తికి ఈ విచిత్రమైన విషాదం కలగటం ఎలా సాధ్యం? ఒక భక్తుడు అమ్మతో ఒకసారి "కన్నీళ్ళు కారుస్తున్నావా? అమ్మా! భూమిమీద ఒక్క చుక్క కూడా పడకూడదు. అలాపడితే అది భయంకరమైన ఆపదకు గురిచేస్తుంది అన్నాడు. అమ్మ సమాధానంగా "భూమిమీద వున్న నీళ్ళన్నీ నా కన్నీళ్ళే. ఒక చుక్కా! అసంఖ్యాకమైన కన్నీటి జల్లులు క్రిందకు పడ్డాయి ఇంకా పడాల్సివుంది" - అని చెప్పింది. Jesis కన్నీటి చుక్కలు, మేరీ అశ్రువులు, తన సంతతి బాధలను గూర్చి ఎడతెగని తల్లి కన్నీటి బిందువులు.... ఎన్నో.... ఎన్నెన్నో!

కాబట్టి దారితప్పిన పిల్లలుగల తల్లి ఆర్తితో రారమ్మని వారిని పిలుస్తున్నప్పుడు ఆమెలో కన్పించే విషాదంతో సమ్మిశ్రితమై వుంటుంది అమ్మ ప్రశాంతత. వాగ్దత్తమైన ప్రదేశపు సరిహద్దు వద్ద విషాదంగా నిలబడుతుంది. మన బాధ అనబడే వక్రమార్గంలో మనం దారి తప్పిపన్నామనే విషాదమది. ఆమె యెక్కడకు పోయిందో అచటకు మనం అనుసరించ లేమనే విషాదం. ఎక్కడసుఖ దుఃఖాలు సమాన మయ్యేంతటి అపారతృప్తి, జీవితపు కాఠిన్యానికి సార్వత్రిక మైన అంజనంలాంటి ప్రేమ గల సీమకు మనం అనుసరించ లేదనే విషాదం. ఈ అపేక్షతో కూడిన ప్రేమ, విషాదంతో మిశ్రితమై వున్నది అనే విషయానికి సంకేతమైన, తరచూ పునరావృతమయ్యే చిన్న క్రతువు ఒకటివుంది. తన మంచం ప్రక్కన సమర్పణగా వుంచిన అనేక పుష్పాలలోంచి అమ్మ ఒక గులాబీపూవు అందుకుని తన్మయంగా, సున్నితమైన ఆకాంక్షతో కూడిన చనువుతో కొంతసేపు దానిని చూస్తుంది. దానియందు మోహపడినట్లుగా కనబడుతుంది. తన అర చేతుల మధ్యగా దాన్ని అటుఇటు దొర్లిస్తుంది. ఇప్పుడు సుతిమెత్తగా దాన్ని అదుముతుంది. ఒక క్రొత్త ఆటవస్తు వును చూచి పరమాహ్లాదంతో పులకరించిపోతూ, దాని ప్రతి రహస్యమూ అన్వేషించాలనే ఆతురత కల్గిన పసిపాపలాగా ఆ పువ్వును తన నుదట ఒత్తుకుంటుంది. దాన్ని వదలివేసి మళ్ళీ మరో పూవును అందుకుంటుంది. దాన్ని తెరుస్తుంది.

దాని కీలాన్ని, కేసరావళిని పరిశీలిస్తుంది. అదొకరకమైన ఆట. అయినా ఆ క్రీడయందు ఒక శ్రద్ధ, ఆటకంటే మించినది అనిపించే ఒక ఉద్దేశ్యపూర్వకతవుంది. దాని లోతైన అర్థానికి మనలను మేల్కొల్పే, మనలను హత్తుకొనే ఆర్ద్ర పూరితమైన లక్షణముంది. ఈ సున్నితమైన శస్త్రచికిత్స నిర్వహించే మృదువైన అమ్మతీరు అసాధారణంగా దాన్ని గాయపరచేందుకు అమ్మ భయపడుతున్నదా అనిపించేటట్లు ఉంటుంది.

మృదువుగా, తన స్వంతసృష్టి మహిమకు పసిపాపవలె ఆశ్చర్యపడుతూ, దానిని తనకు హత్తుకుంటూ, తట్టుకోగలదో ? లేదో ? అని దాని ఓర్పును పరిశీలిస్తూ, బుజ్జగించే విధంగా దానిని తెస్తూ, సున్నితంగా దాని రేకలను ఇక్కడ అక్కడ సవరిస్తూవుండే విధానమేనా ? భగవంతుడు తన సృష్టితో, ఆత్మలతో, నా ఆత్మతో ఆడుకోవటం ? ఎంత ప్రియమైన రూపకాలంకారం అమ్మ సమకూర్చింది! అయినా ఈ రాత్రి అమ్మను గమనిస్తుంటే ఈ అలంకారం దాని హద్దుల్ని త్రెంచుకుని నిజమై నిలిచింది. పువ్వుతో ఆడుకుంటున్నట్లు ఇంకేమాత్రం కనిపించలేదు. అమ్మ ఒక ఆత్మతో ఆడుకుంటున్నది. దాన్ని తెరుస్తూ తన స్పర్శతో దాని వికాసగతిని త్వరితం చేస్తూ - నా ఆత్మతోనే అమ్మ ఆడుకుంటున్నది.

అకస్మాత్తుగా అమ్మ నన్ను తన మంచం దగ్గరకు రమ్మని సైగచేసింది. ఒక ఆటవస్తువుతో ఆడి ఆడి విసిగి పోయి, దాన్ని తోటి సహచరునికి అందించినట్లు పసిపాపవలె ఆ పువ్వును నాకు చురుకుగా అందించింది. తనను కను గొన్నందుకు అమ్మ నాకిచ్చిన బహుమానమది.

జిల్లెళ్ళమూడి దర్శనార్థం వచ్చే యాత్రికుడు అమ్మ ఉపయోగార్థమో, ఆమె భావించిన రీతిలో దానిని పంచ డానికో అమ్మ పాదాలకు సమర్పించే తమ పవిత్ర హృద యాలకు సంకేతంగా పత్రమో, పుష్పమో, ఫలమో అమ్మకు ఈయటం ఒక ఆచారంగా ఉంది. విధి విహితంగా ఒకడు ఎన్నోసార్లు అమ్మకు ఎన్ని సమర్పించుకున్నా అమ్మ వాని యందు సావధానత కనబరచక పోవడం చిత్రంగాఉంటుంది. నిజమైన భక్తి తత్పరతతో ఒకసారి ఇయ్యి - అమ్మ అది తనకు సమర్పించిన హృదయపు భౌతికరూపమా అన్నట్లు దాన్ని చాలా సేపు ప్రేమతో ముద్దులాడుతుంది.

షిర్డీసాయిబాబా ఏం చేస్తాడో ? నాకు గుర్తుకు వస్తు న్నది. వారు దర్శనమిచ్చే మసీదులో చిల్లర నాణాలు పోసే చిన్న పర్సు ఆయన ఉంచారు. ఇది 'నానా' ది, ఇది 'కాకా' ది, ఇది 'బాపూ'ది అని సన్నగా గొణుక్కుంటూ ప్రతి సన్నిహిత భక్తుని పేరూ వరుసగా పలుకుతూ ఆ పర్సులోని నాణాలను ఆయన ఖాళీచేసేవారు. రూపాయలు,

పావలాలు, పైసలు అవి ఇంకేమాత్రం గుర్తించలేనంతగా వాటిని అరగదీస్తూ గంటల తరబడి కాలక్షేపం చేసేవారు. ఈ రకంగా బాబా - ఎవరి శిక్షణ వారిపై వేసుకున్నారో వారి హృదయాలను, మనసులను మెరుగుపెడుతూ గరుకు ఉన్న చోట్లను రుద్దుతూ, వారు ఇస్తున్న ఆంతర్యమైన పారమార్థిక సహకారాన్ని స్పష్టంగా ప్రదర్శించేవారు. గట్టితనంతో, కరుకైన తీరుగల బాబా లోహాలను తన వ్రేళ్ళతో అరగదీస్తుంటే, అమ్మ తన వ్రేళ్ళతో పూవును బుజ్జగిస్తూ తెరిచే తీరు వారి విధానాలలో తేడాకు సంకేతంగా వుంది.

* * *

నాపై అమ్మకు గల ప్రభావానికి రేఖాత్మకమైన దీటైన సంకేతమది. నేను భారతదేశానికి రాకపూర్వం ఆత్మ యొక్క అంతర్జీవితం అన్ని వాస్తవ సందర్భాలలోనూ దృష్టికి అందకుండా ముడుచుకున్న మొగ్గలాగా, గర్భస్థ పిండంలాగా వుండేది. నా సమాజపు భౌతిక విలువలను నేను స్పృహతో తిరస్కరించినప్పటికీ. ఆసమాజపు మొలక నైనందున వ్యతిరేకదిశకు మొగ్గి వుండే నా ప్రేరణలను పూర్తిగా విశ్వసించడానికి, కనీసం అర్థం చేసుకోవడానికి కష్టమయ్యేది. ఆత్మయొక్క సూక్ష్మము, సున్నితమూ అయిన ప్రేరణలు ఇతరులతో పంచుకోడానికి వీలులేనంత ఆత్మీయమైనవిగానూ, నైజమైనవిగానూ తోచేవి. అవి

ఇతరులకు చెప్పదగినవిగా తోచినప్పటికీ, అవాస్తవికం గానూ, శూన్యంగానూ, నా కేసగం అనుమానంగానూ వున్న నా భావాలకు తగిన రీతిలో గ్రహించలేని ఎగతాళికి గురి కావలసి వస్తుందేమోనని ఖాయంగా నాలోనే దాచుకొనే వాడిని. ఈ అపనమ్మకపు యుగంలో చాలా మంది ఇతరులకు పలెనే నా అంతర్వాణి అణచి వేయబడి నిరుత్సాహకరంగా బంధించ బడింది.

కానీ అమ్మతో మాత్రం ఇదంతా మారటం మొదలయింది. నాటకీయంగా కానీ, అకస్మాత్తుగా కానీ కాదు. క్రమంగా నెలలు, సంవత్సరాలు గడచినకొద్దీ మారవచ్చింది. నాలోవున్నవి అని తెలియని ప్రాంతాలకు వెలుగు సోకటం మొదలయింది. చాలా కాలంగా ఇసుక బారిన కృతజ్ఞతా భక్తిప్రపత్తుల ప్రాంతాలు, అమాయకత, అద్భుతాల ప్రాంతాలు - ఇప్పుడు ఆశ్చర్యకరంగా వెలుగుకి గురైనాయి. దాగిన పువ్వు అమ్మ చేతిలోవుంది. అమ్మ దాన్ని పసిగడుతోంది. పిండుతోంది. విడదీస్తోంది. నా వృద్ధ స్నేహితునివలె పూర్వం అనూహ్యంగా వున్న అవకాశాలతో నిండుగా జీవితం మళ్ళీ ఆరంభమైనట్లు నేను భావించాను. ఈ క్రొత్త జీవితంలో నాలోటుపాట్లను గూర్చిన బాధాకరమైన ఎరుకతో వికృతంగా, పరాధీనంగా వున్న కేవల శిశువుగా వున్నాన్నేను. పాత్రతకు మించిన క్షమా, సహ

నాలు అమ్మ నుంచి జతపడ్డాయి. దయతో అమ్మ నా బల హీనతలను అలక్ష్యం చేసి తన శ్రద్ధాసక్తులను నాలో మేల్కొంటున్న శక్తులను పెంచేందుకు ఉపయోగిస్తూ. ఆ శక్తులపై కేంద్రీకరించింది. ఈ దృక్పథం అమ్మకు సహజంగా వస్తుంది. అదే "తల్లిగా బిడ్డలో నేనే తప్పునీ చూడలేను" అనే అమ్మ వ్యాఖ్యలో ద్యోతక మౌతుంది.

ఇతరులలో మంచిని చూసే సంగ్గా ఈ దృక్పథమే అమ్మ దగ్గరకు వచ్చే వారిలోని శ్రేష్ఠతని వెలుపలికి తీసుకు వస్తుంది. అమ్మ లెఖ్ఖలో చెడుగా కనపడేదికూడా, తప్పనిసరి పరిస్థితులలో వక్రగతి పొందిన మౌలికమైన మంచితనమే. ఒక బిచ్చగానిని ఒకేరీతిగా చాలాకాలం రాజులాగా సమాదరిస్తే తగిన సమయంలో వాడు రాజులాగానే వ్యవహ రించటం జరుగుతుంది. జిల్లెళ్ళమూడిలో ఈ సూత్రమే పని చేస్తోంది. అమ్మ మాత్రం ఈ ఉపమానాన్ని కొద్ది తేడాతో ఉపయోగిస్తుందనటంలో నాకు సందేహంలేదు. బిచ్చగాడు రాజు అవటం కాదుగానీ బిచ్చగాడినని అనుకునేట్లుగా పెంచ బడిన రాజే చిట్టచివరికి తన నిజస్థితికి మేల్కొవటమది. ఇంతకుముందు చెప్పినట్లు, అమ్మ మన తప్పిదాల యెడ కళ్ళుమూసుకుని వుండటంకాదు. వాటిని తటస్థమైన రీతిలో మనవైపే తిరిగి ప్రతిఫలింప చేస్తుంది. కాని చివరికి మన ప్రతిఒక్కరిలో ఏది అత్యున్నతమైనదో, దానికే ప్రతిస్పంది

స్తుంది. ఇదే మనకు గొప్ప స్ఫూర్తిప్రదమూ, శక్తివంతమూ అయిన అండ, ఆధారమూనూ.

బహుశ ఒక పోలిక ఇక్కడ ఉపయోగపడుతుంది. పసి కంఠనాళాలను ఇప్పుడిప్పుడే వాడటం నేర్చుకుంటున్న శిశువున్నాడు. ఆ శిశువు నేర్చుకునే ప్రయత్నంలో గుర్రు గుర్రుమని, కిచకిచమని, గుణగుణమని అన్నిరకాల శబ్దాలూ చేస్తాడు, తల్లిదండ్రులు ఈ ధ్వనులన్నీ వింటారు. తమ పాప మాట్లాడటం నేర్చుకోవాలని వారు ఉద్దేశిస్తున్నారు. కనుక పెద్దవాళ్ళ మాటల్ని చాలావరకు పోలివుండే ధ్వనులకు సానుకూలమైన నవ్వులతో - ప్రోత్సాహంతో బదులిస్తారు. మొదటిసారిగా గుర్తింపతగిన "మా" "పా" అనే ధ్వనులకే వారు పరవశులౌతారు. ఈ విధంగా క్రమంగా ఆశిశువు తల్లిదండ్రులకు ఏ రకమైన ధ్వనులు సంతృప్తినిస్తున్నయో గమనించగలిగే స్థితికి వస్తాడు. త్వరలోనే మాట్లాడగల్గుతాడు. ఇదే రీతిలో అమ్మ తన పారమార్థిక సంతానంలో ఒక్కొక్కరిలో ఏవి ఔన్నత్యంతోకూడివున్నాయో, వివేచనతో వాటికి స్పందిస్తూ ఆ లక్షణాలను అమ్మ ప్రోత్సహిస్తూ పోషిస్తుంది. 'చెడ్డ'కు అమ్మ 'అంధురాలు'కాదు. దానిపట్ల ప్రోత్సాహకరమైన శ్రద్ధను కేవలం ఉపసంహరిస్తుంది. దానంతట అదే రాలిపోనిస్తుంది. జిల్లెళ్ళమూడిలో ఇదే సాధారణమైన నియమం. కాని సహ

జంగా, అమ్మ దృష్టిలో నీవేర్పరచుకొన్న ఏ నియమమైనా దాన్ని ఉల్లంఘించటానికి నువ్వు ఏర్పరచుకున్నదే. కనీసం బాహ్యదృష్టికైనా చాలా స్వల్పమైన లోపాలుగా కనబడే వాటికి, చాలా అరుదైన సందర్భాలలో ఎవరినో ఒకరిని అమ్మ మందలించటం నేను చూశాను. సముచితంగా - ఎవరు తమను తాము అమ్మ చేతులలో ఆమెచేత మలచ బడేందుకు సమర్పించుకున్నారో, అట్టి అత్యంత సన్నిహితులైన శిష్యుల విషయంలోనే ఇట్టివి జరుగుతాయి. ఇంకొక వైపు తన చుట్టూవున్న వారిలోని కొన్ని తప్పులను పట్టించు కోనట్లు కనబడే సందర్భాలూ వున్నాయి. పూర్తిగా ఉచిత మనిపించే విమర్శనుంచి ఒకరిని కాపాడే ప్రయత్నం చేయ వచ్చు. మరోసమయంలో అపాత్రులను అనవసరంగా పొగడవచ్చు. ఈ రకంగా అమ్మ ప్రవర్తించేందుకు, వెంటనే కంటికి కనబడకపోయినా ఎల్లప్పుడూ మంచి కారణాలు వున్నాయని నమ్మేందుకు నా స్వానుభవమే దారి చూపు తుంది.

ఒక చిన్న ఉదాహరణ. జిల్లెళ్ళమూడి వచ్చిన కొన్ని నెలల తరువాత నా మనసు ఎడతెరిపిలేని సంక్షోభంతోనూ, ఆందోళనతోనూ, ఉన్న కొంత కాలము భారంగా గడిపాను ధ్యానం ద్వారా దానిని తిరిగి అదుపులోకి తెచ్చే ప్రయ త్నాలన్నీ పరిస్థితి మరింత విషమించేందుకే పనిచేశాయి.

క్రుంగిపోయినట్లు, జిల్లెళ్ళమూడిలో అంతటి దివ్యత్వపు సాన్నిధ్యంలో కూడా నా పరిస్థితి ఈ రకంగా వుంటే నా అవస్థ సహజంగా ఏమాత్రం ఆశలేనిదని అంధకారమయంగా తలపోశాను. ఈ అగాధమైన నిరాశలో, ఉపాధ్యాయ స్నేహితులు శ్రీ జెట్టి చలపతి నా గదికి వచ్చి అమ్మ తనతో మాట్లాడుతూ "నా పిల్లలందరూ శాంత స్వభావులే. ప్రత్యేకించి రిచర్డ్ అతను ప్రశాంతమైన వ్యక్తికదూ!" అని వ్యాఖ్యానించిందని నాకు చెప్పాడు. తేటతెల్లంగా ఉన్న ఈ అపాత్రమైన ప్రశంస వలన నేను అయోమయ స్థితిలో పడిపోయాను.

అమ్మ నన్ను ఎగతాళి చేస్తోందా ? ఖాయంగా అప్పటి చెదిరిన నా మానసికస్థితి సర్వమూ తనకు తెలుసు. మరి అప్పుడటువంటి వ్యాఖ్య ఎలా చేయగలిగింది ? ఇది చాలా చిత్రంగా ఉంది. కాని వెంటనే ఈ అస్వాభావికమైన అవిశ్రాంతత అమ్మ సత్యవచనాలతో మంత్రింపబడి, తగ్గుముఖంపట్టి, త్వరలోనే పూర్తిగా అదృశ్యమైంది.

ఇంకొకసారి అమ్మ సన్నిధిలో ఉండేందుకు నన్ను సిగ్గుపడేటట్లు చేసే 'అపవిత్ర' భావాలతో పరాధీనమై నేను అమ్మ గదిలోకూర్చుని ఉన్నాను. అమ్మ నన్ను దగ్గరకు పిలిచి, నాకెంతో ఇబ్బంది కలిగించే విధంగా, ఆ సమయంలో గదిలోని ఇంకొక పెద్దమనిషికి, రిచర్డు ఎంత సాత్విక స్వభావుడో అనిచెప్పి, నాకోసం అంతా ఆయనచేత అనువదింప

చేస్తూ, ఆ అభిప్రాయాలు నాకోసం ఉద్దేశింపబడినవేనని చూపుతూ, చెప్పటం ప్రారంభించింది. "నా మనసు నిజస్థితి అమ్మకు తెలుసు. నేను సాత్వికుడనని కేవలం పలికే బదులు, నన్ను వాస్తవంగా ఆ రకంగా చేయటం ఆమె బాధ్యత కదా" అని రోషంతో సమాధానం చెప్పాలనేంత ఆవేశం ప్రథమంలో నాకు కలిగింది. సముచితంకాని ఈ సమాధానం చెప్పకుండా నన్నునేను నిగ్రహించుకున్నాను అమ్మ చెప్పింది నేను ఆలోచించినకొద్దీ అమ్మ చూస్తున్న రిచర్డ్ అప్పటికే సాత్వికుడనీ, ఆమె దృక్కోణం నుంచి 'నన్నలా చేసే' ప్రశ్నే లేదని నాకుతోచింది. ఎందుకంటే ఆమె పవిత్రమై ఉంది కనుక, ఇతరులలో సహజమైన పవిత్రతనే అమ్మ చూడగలదు కనుక. నా దృష్టికి నేను అపవిత్రంగా గోచరమైతే అది నా దృష్టికి గల పరిమితుల కారణంగా మాత్రమే.

మళ్ళీ అనూహ్యమైంది జరిగింది. వాటి స్థాయిలో వాటికెదురొడ్డి నేను పోరాడినప్పుడు ప్రబలంగా భయంకరంగా తోచిన వ్యాకులపాటు కలిగించే ఆలోచనలే, అమ్మ కళ్ళతో నన్ను నేను ఒక క్షణం పాటు చూసుకోగానే ప్రయత్నం లేకుండానే నా మనసు శుభ్రమయ్యేంతగా మాయమయినాయి. మొదట్లో అమ్మమాటలు అసంగతంగా తోచినప్పటికీ, స్థాయి తగ్గిన ద్వైధీభావ దృక్పథంతో, జగడమాడే తీరు తగ్గిన దృక్పథంతో నేను పరిస్థితుల్ని గమనించ

డానికి దారితీసే అమ్మమాటలు స్వయం ఫలప్రదమైన భవిష్యవాణిగా మరోసారి పరిణమించాయి.

నిరంతరం మారుతూండే ఆలోచనల, భావాల దోబూచులాటల అడుగున, అవిశ్రాంతత చేత వ్యాకులత చెందనిదీ అపవిత్రతచేత స్పృశింపబడనిదీ అయిన ప్రధానమైన 'నేను' ఉన్నది. అమ్మ దానిని చూడగలదు. అమ్మ దానిని చూడటమనేది నేనుకూడా దానిని చూసే అవకాశమిచ్చింది.

*　　*　　*

నా స్వానుభవానికి నిజమని ధ్వనించే సంఘటన నాకు జ్ఞాపకమొచ్చింది. అమ్మను చూడటానికి వచ్చిన ఒకరు అమ్మకు యాపిల్ పండొకటి సమర్పించారు. బయటకు బాగానే కనిపించింది. కానీ అమ్మ అది కుళ్ళిపోయిందని చెప్పి సులువుగా తనవేలు దాని చెక్కులోనికి పోనిచ్చి లోపల కుళ్ళిన గోధుమ రంగు కండను విప్పిచూపింది. ఆ భక్తుడు దీనికి సహజంగా ఆందోళితుడై విచారంగా "నా కెప్పుడూ ఇలాగే జరుగుతుంది. ఆ యాపిలు పండువలెనే నేనూ హృదయంలో చెడిపోయి బాహ్యంగా బాగున్నట్లున్నానేమో బహుశా "అని విచారంతో తలపోశాడు. కానీ అమ్మ ఇట్టివి అంగీకరించదు. "నీకుళ్ళు పోయిందంటున్నాను." అని అతనికి బలంగా నచ్చచెప్పింది. తన మాటలు ఋజువు చేసేందుకన్నట్లు ఆపాడైపోయిన భాగాన్ని తిన్నది. ఆ పండుని చాలా వరకు తిన్నప్పుడు "నువ్వన్నట్లుగా ఏమీ

లేదిది. చూడు మధ్యలో అంతా వాడిపోకుండా చాలా క్రొత్తగా ఉంది" అంటూ లోపలిభాగం చూపింది. అది నిజమేమరి. మధ్యమధ్య ఉండే కుళ్ళుమూలంగా మన దృష్టిపథం నుండి అంతర్గత పవిత్రత చాలావరకు దాగినా, మన విషయంలోనూ ఇది నిజమే. మన శ్రద్ధని ఈ కుళ్ళు మీద లగ్నంచేస్తే, ఇంకా దాని పెరుగుదలకు మరింత చురుకుదనం పుట్టించటమే. అందరిలోని మంచితనాన్ని వెలుగులోకితెచ్చే తద్వ్యతిరేకపథం అమ్మ అవలంబిస్తుంది.

తత్ఫలితంగా తన బోధనలలో పాపం అనే భావనకు అమ్మ చోటివ్వలేదు. "మంచీ చెడుల్నిగురించి శతాబ్దాల తరబడి జరిగిన నీతిబోధ నిజంగా పనిచేసిందా ?" అని అమ్మ అడుగుతుంది. నీతిబోధలు మానవజాతిలో సంస్కరణను తీసుకురాగలిగితే, ఇప్పటికే జరిగిన నీతిబోధలు ఆ చమత్కారం చేసి ఉండేవి. కాని సరిగ్గా దానికి వ్యతిరేకమైన అవస్థ ఉంది. చెడుకి వ్యతిరేకంగా ఎంత బిగ్గరగా గొంతులెత్తి అరిస్తే అది అంతగా పాతుకుపోతున్నట్లు కనిపిస్తుంది. తామే ఋజువర్తనులమని అరిచిగీపెట్టే విమర్శకులే వారు చెప్తున్నమందు అవసరం తరచుగా అత్యంతంగా ఉన్నవారని అమ్మ వ్రేలెత్తి చూపుతుంది.

ఇక దీనికి పరిష్కారమేమిటప్పుడు ? అమ్మ సమాధానమిచ్చేంతటి మాటకారికాదు. ఒక సమాధానంకోసం మన

మెదురు చూస్తున్నామన్న అర్థంలో సమాధానంలేదని అమ్మ నొక్కిచెపుతుంది. చెడు ఉంటుంది. భూమిమీద మన జీవనంలో అదొక వాస్తవం. నిజంగా దానిని ఇచ్ఛామాత్రంగా పోగొట్టేశక్తి మనకున్నట్లయితే, అప్పుడొక స్ఫూర్తినిచ్చే నీతిబోధ, సకాలంలో ఒక నూతన సంవత్సర నిర్ణయం - ఇవిమాత్రమే మనలను యోగులుగా మార్చటానికి అవసరమై ఉండేవి. కానీ ప్రకృతిని అంత సులభంగా వంచించటం కుదరదు. మన జీవితాలలోనూ, విస్తారమైన ప్రపంచంలోనూ మంచి, చెడూ ఈ రెండూ మన దుర్బలమైన సంకల్పాలకు అతీతంగా ఉన్న అనంతమైన శక్తిచేత నియమించబడ్డాయి. అమ్మ లెక్క ప్రకారం చెడు ఉండటానికి బాధ్యత ఎవరికైనా ఆపాదించాలీ అంటే మొదటిసారిగా దానిని విధించిన భగవంతుడికే చివరికది చెందుతుంది.

బాగా స్థిరపడిన మతాలలోని విభిన్న ధృవాలకు చెందిన దృక్పథాలతో కూడిన వేదాంత సిద్ధాంతాలలో పరస్పరం భిన్నమూ సమానమూ అయిన రెండు స్వతంత్ర ప్రతిపత్తితోచే విభాగాలు ఉన్నాయి.

అవి భగవంతుని మంచిపనులు, దయ్యపు దుష్కర్మలూ అనీ, భగవంతుని పవిత్రసంకల్పమూ, అపవిత్ర మనుష్య సంకల్పమూ అనీ ఈ రకంగా, మరొక ప్రక్కన అమ్మ ఈ ద్వంద్వ విభాగాలను ఏమీ ప్రస్తావించదు. రెండోది

లేకుండా భగవంతుడు ఒకటే. 'ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ' మంచీ, చెడూ ఒకే రకంగా అతని సృష్టులే. వాని సంకల్పం నుండి మనుష్య సంకల్పం వేరుకాదు. సరికదా అవి వాని సంకల్పంయొక్క పూర్ణమూ అభిన్నమూ అయిన వ్యక్త రూపాలే. అంతావాడే.

నిజానికి ఇందులో క్రొత్తదనంలేదు. అద్వైతబోధన ఆధ్యాత్మిక చింతన యొక్క అత్యున్నత సమావిష్కారం. ప్రపంచంలోని శ్రేష్ఠమతాలన్నింటిలోనూ దీనిని చూడవచ్చు. కానీ చాలా సంప్రదాయాలలో ఏకొద్ది మంది దీక్షితులకో అర్థమయేరీతిలో ఈ బోధన రహస్యసూత్రాలలో బహిరంగ పరచకుండా పొదిగారు. ఈనాటికీ భారతదేశంలో కూడా ఇది నిజమే. అద్వైత వేదాంతపు ఉన్నత సత్యాలు సామాన్య మానవజాతికి వెల్లడించడం అపాయకరమని వంశపరంపరానుగతంగా వాటికి సంరక్షకులయిన బ్రాహ్మణ పండితుల అభిప్రాయం ఈనాటి వరకూ అదే

ఈ రకంగా ఎట్లా పరిణమించింది? ప్రాచీన క్రైస్తవానికి చెందిన గ్నాస్టిసిజం (gnosticism) తరువాతి చర్చి సమావేశాలలో సభలలో ఎందుకు బహిష్కరింప బడింది? కన్ఫ్యూషియస్ (ప్రాచీన చైనావేదాంతి) అనుచరులు ఎందుకు 'లావ్‌త్జు'ని హానికరమైన వ్యక్తిగా భావించారు? ఏది ముస్లిం ప్రజలు వారి సూఫీ ఋషులలో మరింత విశదంగా మాట్లాడేవారిని కాలక్రమంగా రాళ్ళతోకొట్టి చంపేట్లు చేసింది?

ఈ సంఘటనలన్నింటిలోనూ అదే భీతిగొలిపే ప్రేరణ పనిచేస్తోందని మనం గమనించగల మనుకుంటాను. సుస్థిర మానవ మత సంరక్షకులకు మతం పరమసత్యావిష్కారంగా కంటే, అవినీతికి ఎదురు పోరాటంలో కాపుగా, మానవ మస్తిష్కాల నుండి సంప్రదాయపు విధి నిషేధాలు తొలగించినట్లయితే ఖాయంగా వరదలై ముంచెత్తగలదని భావింపబడే అస్తవ్యస్తత అనే ఉప్పొంగే జలాలను నిలిపి ఉంచే ఆనకట్టకు ఊతంగా ఎక్కువగా భావింపబడుతుంది. అటువంటి వాతావరణంలో మంచీచెడుల తారతమ్యాలను గూర్చి ఆ రెంటికీ బాధ్యత ఒకే దైవశక్తిది అని చెప్పే సిద్ధాంతం సహజంగానే సందేహాస్పదమైంది, ఈ సిద్ధాంతం మనిషి తన కర్మలకు తానే బాధ్యుడు అనే మౌలిక సిద్ధాంతాన్ని బలహీనపరుస్తున్నట్లు, ఇప్పటి మతవ్యవస్థ నిలబడుతూన్న దైవదత్తమైన నైతికనియమావళిని ప్రశ్నించేందుకు తయారయినట్లు కనపడుతుంది.

సహజంగా అద్వైతబోధనలు అణచబడి, గుప్త ఉపదేశాలలో దాచబడి, అదీ సాధ్యంకాకపోతే ప్రజాదరణ పొందిన మతంలోని అన్నిటికంటె తక్కువ ఉన్నతమైన సత్యాలతో కలుపబడి నీరుకార్చబడ్డాయి. కానీ ప్రతితరంలోనూ, దేశంలోనూ ఆధ్యాత్మిక విగ్రహ విధ్వంసకులు, ప్రపంచానికి, కష్టమైన వారి సత్యాన్ని ప్రకటించటం

కోసం, అపార్థం చేసుకొనబడటానికి, తరచూ పీడింబబడ టానికి సిద్ధపడుతూ ఉద్భవించారు!

ఈ రకమైన వ్యక్తిత్వానికి 'లావ్‌త్జు' పరిపూర్ణ మయిన ఉదాహరణ. అతని 'బోధనలు కాని బోధనలు' అమ్మ మాటలకు చాలా విధాలుగా చాలా సమీపంగా ఉన్నాయి. ఐతిహాసిక కథనాలు మనం నమ్మవలసివస్తే చైనాదేశపు తరతరాల నైతిక వ్యవస్థకు ప్రవర్తకుడయిన కన్ఫ్యూషియస్ చేత గొప్పగా మెచ్చుకోబడినవాడూ. అతనికి కొద్దిగా బెదురు పుట్టించిన వాడూ అయిన ఏకైక సన్యాసి అతడే, లావ్‌త్జుని మానవ నిర్మితమైన నియమా లను అధిగమించిన వింత ధోరణిగల అతిలోక మానవునిగా కన్ఫ్యూషియస్ చూశాడు, మరోప్రక్క లావ్‌త్జు నైతిక సూత్రాలను క్రోడీకరించి అమలుజరిపే ప్రయత్నంలో వాటికే దెబ్బ కలించే సదుద్దేశ పూరితుడైన దారి తప్పిన సంస్కర్తను కన్ఫ్యూషియస్‌లో చూశాడు. లావ్‌త్జు ప్రకా రం నీతి చట్టంగా మార్చబడడం అంటే జీవితం రాతిగా చెక్కబడటం వంటిది. ప్రాణరహితమైన నిష్ఫలమైన విషయం. మంచికోసం పోరాడటం సూక్ష్మంగా చెడుకి మరింత బలం చేకూర్చటం అన్న ద్వైతం యొక్క ప్రాథ మిక సూత్రాన్ని ఆయన అర్థం చేసుకున్నాడు. ఒక ఆదర్శంకోసం ప్రయత్నించడం' అంటే మనకు బాహ్యమైన ఒక వస్తువుగా దానిని చేసి మరింత దూరంగా నెట్టడమే,

ఆంతరిక దారిద్ర్య భావాన్ని బలవత్తరం చేయటమే. నేరము, అపజయాల వలయాన్ని గిరగిర తిరగటానికి సిద్ధపరచటమే దీనికి విరుగుడుగా చెడుని తప్పించుకుంటూ, మంచిని చేయాలని ఎవరికి వారు ఆదుర్దాపడటం ఆపమనీ, ఈ మొత్తం విచారపడే వ్యాపారం నుంచీ అవతలికి గెంతెయ్యటం ఇంకా మంచిదనీ అగొప్ప ఋషి సిఫారస్ చేశాడు. సన్మార్గం కోసం ఈ పిచ్చిపరుగు ముగిసిన తర్వాత మాత్రమే నిజమైన సౌశీల్యం పుట్టేందుకు అవకాశం ఉంది.

అమ్మ విధానంలోకూడా కేంద్రంగా ఈ రకంగా విరోధంగా భాసించే లక్షణమే ఉంది. వారి దుష్ట ప్రవృత్తులను వారెలా జయించాలని ప్రజలు అడిగినప్పుడు వాటిని గూర్చి ఏరకంగానూ ఆందోళన పడవద్దని అమ్మ బోధించింది. వికసించటానికి సరియైన దృక్పథమేమిటి? అంటే మనం చెడు అని తలుస్తున్నదికూడా భగవంతుని నుండి వచ్చిందనుకోవడం అని అమ్మ చెప్తుంది. 'దానిని భగవంతుడే ఇస్తాడు, మళ్లీ ఎప్పుడు ఉచితంగా కనిపిస్తే అప్పుడు తీసివేస్తాడు.' ఇటువంటి సమర్పణాభావం సంపూర్ణమైనప్పుడు ప్రశాంతమైన అనుభూతికి, ఆధ్యాత్మిక అత్యాశల నిరంతర పోరాటం చేత సమర్ధవంతంగా అడ్డగింపబడిన పవిత్రీకరించే పరమానందం వెల్లుబకడానికి దారితీస్తుంది. ఈ సమర్పణ పద్ధతికి ప్రోత్సాహకంగా బాధ్యత అంతా తనపైన వేసుకుంటానని అమ్మ అభయమిస్తుంది. "చూడు.

ఇట్లా ఉండటం నాస్థితి అయింది. నువ్వు బయటకు వెళ్ల వచ్చు. బురద పూసుకోవచ్చు. కానీ నీవు తిరిగి ఇంటికి వచ్చినపుడు నీకు నీళ్లుపోస్తాను. అన్నం పెడతాను. అదీ స్థితి. నిన్ను నీవు మరచి నీ బాధ్యతలు ఏవీలేవని తెలుసుకో. ఇంతకుమించి నీకు ఏం కావాలి ? ఇదీ బ్రహ్మానందమైనస్థితి." కొద్దిసమయం సమాధ్యవస్థను అనుభవించి, మళ్లీ జగత్ చైతన్యంలోకి తిరిగివచ్చే వ్యక్తికూడా పొందలేని 'నిగూఢ స్థితి ఇది'.

ఈ అభయాన్ని అపార్థం చేసుకోవటం సులభం. మొత్తం అమ్మ బోధనల సందర్భం విడిచి దీనిని మాత్రమే లోతుగా జొరబడకుండా పైపైన చదవటం వల్ల పరిణత కర్తవ్యాన్నుండి తప్పించుకునే శైశవపు ఆలోచనా రాహిత్యాన్ని బాధ్యతా రాహిత్యాన్ని ప్రోత్సహించే తిరోగమనాన్ని అమ్మ ప్రతిపాదిస్తున్నదని ఎవరైనా నమ్మవచ్చు. అమ్మ మాటలయొక్క అసలైన భావం ఇంకెంతో ఉత్కృష్టమైనది. వాటికి స్వంత పెంపకాన్ని గురించిన ఆలోచన లేకున్నా భగవంతునిచే పోషింపబడి చక్కదిద్దబడే మెట్ట తామరపూలనుండి గుణపాఠం నేర్చుకోమన్న క్రీస్తు మందలింపు జ్ఞాపకం వస్తుంది. అదేవిధంగా రక్షించి పోషించే భగవంతుని ఉనికిలో అమాయక విశ్వాసాన్ని కలిగి ఉండడాన్ని అమ్మ ప్రతిపాదిస్తుంది. సృష్టిమూలపు

(భగవంతుడు, శక్తి, ధర్మం, బుద్ధుడు, అమ్మ మరేపేరుతో నైనా పిలవండి) సర్వవ్యాపకమైన ఆధారంలో పసిపాప కుండేంతటి విశ్వాసమే మన స్వంత మసక మసక వెలుగుల, ప్రయత్నాలమీద పూర్తి పరాధీనత సృష్టించిన ఆందోళనల చిక్కుముడి నుండి మనలను విముక్తులను చేయగలదని, నిజానికి పారమార్థిక లోకంలో ఉన్నతులైన ఆచార్యు లందరూ నొక్కి వక్కాణించారు. అమ్మ సంక్షిప్తంగా చెప్పి నట్లుగా" అన్నిచింతలూ నువ్వు కర్తవనుకోవటంతోనే పుడు తున్నాయి. ప్రతివిషయమూ నువ్వుస్వయంగా చేసిందే అని ఆలోచించినపుడు నీకు బరువైన బాధ్యత ఉన్నట్లు నువ్వే అనుకుంటావు. ఆ బాధ్యత భగవంతుడిమీద విసరివేస్తే నీవు హాయిగానూ, ఉపశమనం పొందినట్లుగానూ అనుభూతి చెందుతావు".

భగవంతుని భుజాలమీద బాధ్యత వేయటమంటే దాని నుండి తప్పించుకోవటంకాదు. ప్రత్యక్షంగా ఉన్నది గుర్తించడం మాత్రమే. వేర్పాటు పొందిన నా స్వంత అహంకారంకన్నా విశ్వంలో ఉత్కృష్టమైన శక్తి పని చేస్తున్నదని, నాప్రయత్నపు జయాపజయాలు చివరికి నా అధీనానసనికి అతీతంగా ఉంటాయని గుర్తించటమే. నేనెలా వ్యవహరించితీరాలో అలాగే వ్యవహరిస్తాను. కానీ ఫలితాలు నాచేతులలో లేవు అన్న విషయాన్ని మరచిపోవడానికి నేను ఒప్పుకొను.

పై విధానంలోని వివేకం మతపరమైన ప్రగాఢ విశ్వాసం నుండి వచ్చినదికాక సరళమైన ఇంగితజ్ఞానం నుండి వచ్చింది. అయినప్పటికీ స్వయంప్రతిభ అనబడే భ్రమకొల్పే భావాన్నుండి వాస్తవంగా విముక్తులైన వాళ్ళను చూడటం ఎంత అరుదు! అనుభవంలోని విషయం ఏమిటంటే పవిత్రులుకూడ వారి విజయాలకు ఉబ్బిపోయి, అపజయాలకు తమనుతాము హింసించుకుంటారు. ఔచిత్యంగాఉన్న రమణమహర్షి ఉపమానం వాడితే, రైలుకంపార్టుమెంటులోని అడుగు భాగం తనమూటా, ముల్లె భరిస్తుందని తెలుసుకోవడంలో విఫలుడై, ప్రయాణం మొత్తం తన సామాను తన నెత్తినే ఎంతో అస్థిరంగా ఉంచుకొనే అజ్ఞానిఅయిన ప్రయాణికునివలే మునమున్నాము.

ఎంత వెర్రిబాగుల గ్రామీణ ప్రయాణికుడైనా త్వరలోనే మంచి అర్థవంతుడైన కండక్టరు చేత మంచి మాటలతో సామాను క్రింద ఉంచే విధంగా నచ్చచెప్ప బడతాడు. భగవంతుడే గమ్యంగా వెళ్ళే రైలులో దారిచూపే కండక్టరు వంటివాడే గురువు. ప్రయాణికులు ధైర్యంగా ఉండేట్లు చేయటం, వారిదోషాలూ, భంగపాట్లూ వారిరక్షణలూ వీటి అన్నింటినీ వదలి హాయిగా బిగింపులు సడలిపోయి విశ్రాంత చిత్తంతో ఉండేట్లు చేయటం గురువుకర్తవ్యం. తన మాటలతో, తనచుట్టూ తాను వికసింప చేసిన పరిసరాలతో తన

సాన్నిధ్యపు ఉపశమన శీలమైన ప్రభావంతో అన్ని బరువు బాధ్యతలనీ విడిచిపెట్టడం సాధ్యమయ్యే శాశ్వత శాంతి భద్రతలు గల వాతావరణాన్ని సృష్టించడం ద్వారా ఈపని చేస్తాడు.

* * *

సరిగా అటువంటి ప్రదేశమే నాకు జిల్లెళ్ళమూడి. అంత యదార్ధ సహనశీలతకు, వైయక్తిక స్వేచ్ఛకు అవకాశం గల మరే సమాజంలోనూ నేనుండలేదు. ఒక ప్రత్యేకమైన ఆలోచనా సరళికిగాని, ప్రవర్తనారీతికిగాని అనుగుణంగా ఉండమని అక్కడ వత్తిడి చేయడం లేనంతగా నేనింకొక ఆధ్యాత్మిక బృందంలో అనుభవించలేదు. కమ్యూనిష్టులు, పారిశ్రామికవేత్తలు, హిందువులు, ముస్లిములు, జిజ్ఞాసువులలో, వృద్ధులు, అలసులు, ఉత్సాహవంతులు, మెరిసిపోయే వ్యాపారస్తులు, సామాన్య వ్యవసాయదారులు ఊహించగల ప్రతిమానవ బృందమూ అక్కడ మనఃపూర్వకంగా ఆహ్వానింపబడుతుంది. జిల్లెళ్ళమూడి తమ ఇల్లుగా భావించేట్లు ఆదరింపబడతారు. అని వార్యంగా జీవితం చక్కటి మచ్చలేని పొందికఉన్నదిగా లేనప్పటికీ అక్కడ మనలను విడదీసే వైరుధ్యాల కంటే మనలనందరినీ ఒక చోటికి చేర్చిన బంధమే చివరికి ముఖ్యమనే అవగాహనకు ప్రతి ఒక్కరూ వారి సహజరీతిలో మేల్కొన్నారా అన్నం

తగా పరస్పరం ఆమోదించుకోవటం ఆశ్చర్యకరమైన స్థాయిలో ఉంది. ఒకరి వింతధోరణి, అంతుచిక్కని తనమూ. వేరొకరి విసుగుకు కారణం కాకుండా తనపాద సన్నిధికి చేరుకునేందుకు ఎన్నో చిత్రమైన, చిక్కైన మార్గాలని అమ్మ రూపొందించింది కదా అన్న ప్రశంశాత్మకమూ, భక్తిభావ ప్రేరకము అయిన ఆశ్చర్యానికి కారణమౌతుంది.

ప్రతి విషయమూ ఏవిధంగా కలిసి ఉండగలిగిందీ అన్న విషయం అప్పుడప్పుడు చాలా అగమ్యంగా ఉంటుంది. స్థానికుల నుండీ కోరబడిన క్రమశిక్షణతో కూడిన దైనందిన పూజాకార్యక్రమంలేదు. భోజనానికి సడలింప వీలులేని నిర్ణీతసమయంలేదు. రాత్రిగాని పగలుగానీ, ఎవరు ఏ సమయంలో వచ్చినా వెంటనే వారికి అన్నంపెట్టాలని అన్నపూర్ణాలయ కార్యకర్తలకు అమ్మ స్పష్టంగా సూచించింది. పనికి సంబంధించిన రోజు వారీ నిర్ణీత కార్య క్రమం లేదు. ఏ బాధ్యతనైనా, ఎవరైనా, ఏస్థాయిలోనైనా తమకుతామే తీసికొనే స్వేచ్ఛ ఉంది. ధనరూపంలో విరాళాలు స్వీకరింపబడినప్పటికీ, భోజనవసతులకు రుసుము లేదు. విధులు సేకరించే ప్రయత్నం పెద్దగాలేదు. ఎవరైనా వయసు వలనకానీ, అశక్తతవలన కానీ, శారీరక మానసిక వైఫల్యాల వలన కానీ అందరింటి ఆహార సముపార్జనలో

ఏదీ నిజంగా చేయగల్గిన స్థితిలో లేనప్పటికీ అభ్యం తరం లేకుండా వారు స్వీకరింపబడతారు.

ఈ అసాధారణ సహనం అచటి సమాజానికి సూటిగా ఉపయోగ పడని వ్యక్తులతో ముగియకుండా నిస్సంశయంగా హానికరమైన వారికి కూడా విస్తరిస్తుంది. యాత్రికుల నుండి ధనమూ, దేవాలయాలలో నగలూ ఆసుపత్రి నుండి కార్యాలయాల పరికరాలు, సిగ్గు లేకుండా దొంగిలించే బొంబాయి నుండి వచ్చిన యువకుని కన్నా అవాంఛనీయుడైన అతిధి మరెవ్వరూ ఉండరు. అయినా ఎవరూ పోలీసులని పిలువలేదు, అతనిని వదిలి వెళ్ళమని అడగలేదు. సన్నిహితంగా అల్లుకున్న కుటుంబ వ్యవహారంగా మాత్రమే ఆ విషయం పరిష్కరింపబడింది. అమ్మ ఆ కుర్రవాణ్ణి పైకి పిలిచి అతడు తనకు చాలా బాధకలిగిస్తున్నాడనీ తనకు చెందని వస్తువులను తీసుకోవటం అతను ఆపివేయాలనీ, ఇకముందు అతనికేమైనా అవసరమైతే దానికోసం తనదగ్గరకు సరాసరి రావాలనీ చెప్పింది. ఈ సంభాషణ ఫలితంగా అతడు అప్పటికి ఇంకా అమ్మని వస్తువులని తిరిగి ఇచ్చాడు. ఓర్పుగల కుటుంబంలోకి అల్లరిపిల్లవాడు ఆహ్వానింపబడినట్లు. అతనికారణంగా వచ్చిన అన్ని ఇబ్బందులనూ లక్ష్యపెట్టకుండా అతను తిరిగి వస్తే విరోధం అనేది ఏమీ లేకుండా ఆశ్రమంలోకి తిరిగి ఆహ్వానింప బడతాడని నాకు నమ్మకం.

ఎవరు తానే రెండవసారి అవతరించిన ఏసుక్రీస్తునని భ్రమపడుతున్నాడో, ఎవరుదేశంలోని దాదాపు చాలా ఆశ్రమాల ముఖద్వారమైనా దాటి లోనికి ప్రవేశించి ఉండ గలిగేవాడు కాదో అతడే వింతవస్త్రధారణ చేసిన బెల్జియం దేశపు మాజీనావికుడైన మరొక ఆగంతకుడు. విపరీతమైన మురికితనంతో అపరిశుభ్రంగా క్రమంలేని గడ్డంతో మెరిసి పోయే రంగుబట్టలతో ఉన్న అతడు అందరింట్లోకి ప్రవేశ పెట్టబడటమే కాకుండా, కొత్తబట్టలు, తోముకునే సబ్బువంటి కానుకలు ఇవ్వబడి దయతో ఆదరింపబడ్డాడు. అమ్మ సాన్నిధ్యంలోకి మొదటిసారి అతడు వచ్చినపుడు ఉద్దేశ పూర్వకంగా పెద్ద అంగలు వేసుకుంటూ అమ్మ కుర్చీదగ్గరకు వెళ్ళి బిగ్గరగొంతుతో "నువ్వెదురు చూస్తున్న వ్యక్తిని నేనే చెలీ" అని ప్రకటించాడు. అమ్మ దర్శనంకోసం చేరిన పెద్ద భక్తసమూహం ముందు రెండుచేతులు జాపి అమ్మను ఆశీర్వదించటం మొదలు పెట్టాడు. ఈ ప్రవర్తనను పట్టించు కున్నట్లు కనబడ్డ వారెవ్వరూలేరు, కనీసం అమ్మైనా. దయార్ద్రమైన వ్యాకులపాటుగల దృష్టితో అమ్మ కన్నార్ప కుండా అతడిని చూసింది. జిల్లెళ్ళమూడిలో అతడున్న కొదిరోజులకాలంలో సంపూర్ణమైన ప్రేమాదరాలకు తక్కువగా అమ్మ అతడిని ఎప్పుడూ చూడలేదు. అతడు వేసుకున్న మానసిక భ్రమ అనే ముసుగుకి అమ్మ పూర్తి విస్మృతితో ఎలాఉన్నదో చూడటం ఒక కనువిప్పుగా ఉంది.

మిగిలిన మా అందరికీ హాస్యము, జాలి ఒకదాని తర్వాత ఒకటి కలిగించే వస్తువుగా 'J' ఉన్నాడు. కానీ అమ్మకు మాత్రం అతడు మరొకబిడ్డగా మాత్రమే ఉన్నట్లు కనబడు తుంది - అంతకు ఎక్కువాకాదు. తక్కువాకాదు.

అమ్మ దయార్ద్రమైన ఆదరణకు అతడప్పుడప్పుడు స్పష్టంగా స్పందిస్తున్నట్లు కనబడేవాడు. అమ్మ అతడిని పిలచి నవ్వుతూ దోసిలినిండుగా తాజా అయిన మధుర పదార్థాలను క్రుమ్మరించిన సందర్భం నాకు ప్రత్యేకంగా గుర్తుంది. వెలిగేముఖంతో అతడు నడిచిపోయాడు. "మీరు చూశారా ఇది: మీరు చూశారా" అని కళ్లు చెమ్మగిలగా దగ్గరుండి వింటున్నవారికి చెప్పాడు. అది ఎంతో కదిలించే సన్నివేశం. తనచుట్టూ తాను కట్టుకున్న అభేద్యంగా కనబడు తున్న బేధభావపు పెంకుని చొచ్చుకు పోవడంలో అమ్మ గెలిచిందని నేను ఖచ్చితంగా గ్రహించగలిగాను. మిగిలిన అందరం ఏకారణంతో ఇక్కడ ఉన్నామో అదేకారణంతో అతడిక్కడ ఉన్నాడనీ - అదే అమ్మ ప్రేమను స్వీకరించడ మనీ నాకు తెలియజెప్పబడింది.

నిరంతరం మసకవేసిన శూన్యదృక్కులతో ఆవరణలో తిరిగే ఒక యువతి జిల్లెళ్ళమూడిలో ఉంది. ఉపయోగ కరమైన పనిలో నిమగ్నమై కాని, అమ్మతో తప్ప మరెవరితో నైనా మాట్లాడుతుండగా గాని ఆమెని నేనెప్పుడూ చూడ

లేదు. అమ్మ దర్శనానికి ఆమె వెళ్ళినప్పుడు అమ్మ తప్పనిసరిగా ఆమెను దగ్గరికి పిలిచి మందలిస్తూనో, బుజ్జగిస్తూనో, కొడ్తూనో, ఆహారం పెడ్తూనో ఒకటి మార్చి ఒకటిచేస్తూ ఉంటుంది. ఆ సమయాలలో ఆమెతో అమ్మ ఏమిచెబుతుందో నాకు లేశమాత్రమూ తెలియదు. కానీ ఆ పిచ్చిది. తరచు, నిదానంగా కొద్ది మాటలు సమాధానంగా ఉద్దేశించే పలికేది. దురవగాహమైన రీతిలో అమ్మ ఆమెకు చేరువైంది అని తేటతెల్లమైంది. ఈ సందర్భాలలో మామూలుగా ఉండే అతకని జాలిగాని, సంరక్షిస్తున్నామనే తీరుగాని తన అంతస్తుకు తక్కువగా దిగిరావటంగా గాని - ఇవేవీలేకుండా "J" విషయంలో వలెనే నిష్కపటంగా పూర్తి మానవత్వంతో ఆమెను ఆదరించటం ద్వారా అమ్మ దీనిని సాధించింది. అమ్మ అనుభవంలో "మనిషికి చెందినదేదీ నాకు అపరిచితం కాదు", అన్న తత్వజ్ఞుని ప్రసిద్ధసూక్తి వాస్తవ విషయంగా ప్రత్యక్షమై ఉంది. మన ప్రమాణాల దృష్ట్యా ఎంత వింత గొలిపే మానసిక స్థితులైనా స్వీయప్రేరణతో అమ్మ సహానుభూతి పొందలేనివి, చొచ్చుకు పోయే తన ప్రేమ యొక్క కాంతిపుంజం ద్వారా అమ్మ స్పృశించలేనివి లేవు.

అమ్మ ఆశీస్సులు పొందేందుకు జిల్లెళ్ళమూడి తీసుకు రాబడిన, మానసిక పరిణామం పూర్తిగా కుంటుపడిన, తన కుమారుని గురించి విశాఖపట్టణానికి చెందిన వ్యాపారభక్తుడు

వివరించిన కథను ఇక్కడ చెప్పకుండా ఉండలేను. అమ్మ సాన్నిధ్యానికి తమ కుమారుడు ప్రతిస్పందిస్తాడని అతని తలిదండ్రులు ఊహించనేలేదు. అతని మానసిక వికాసం శిశువుని పోలిఉండటంతో అతని భాషా ప్రయోగం అరుపులూ మూల్గులకే పరిమితమై ఉండటంతో, పూజలు అమ్మకు ఆపాదించే భక్తి ప్రాధాన్యతను ఏమాత్రమూ అర్థంచేసి కొనే స్థితిలో అతడులేడు. అతని చుట్టూ జరుగుతూన్న విషయంలో ఆసక్తిగాని ప్రమేయంగాని ఉన్నట్లు బాహ్య చిహ్నలేమాత్రమూ లేకుండా మామూలుగానే దర్శనం జరిగేంతసేపూ స్తబ్ధుగా కూర్చున్నాడు

కానీ ఇంటికి తిరిగి వచ్చిన కొన్ని వారాల తర్వాత, వారి పిల్లవాడు కాతర స్వరంతో అమ్మా, అమ్మా, అమ్మా! అని బిగ్గరగా ఏడవటం విని అతనితండ్రి ఉలిక్కిపడ్డాడు. అతని దగ్గరికి హుటా హుటిన వెళ్లేసరికి ప్రబలమైన ఆవేశానికి కదిలిపోయి కళ్లనీళ్ల పర్యంతంగాఉన్న వాళ్ల బాబాయిని చూశాడు. "మీ అమ్మకావాలా నీకు" అని తండ్రి అడిగితే కాదని తన తలని అడ్డంగా శక్తి కొద్దీ ఊగించి గోడమీద ఉన్న అమ్మ ఫోటో వైపు చూపించాడు.

జిల్లెళ్లమూడికి వాళ్లు తర్వాత వచ్చినపుడు, వారు వచ్చీరాకముందే ఆ చిన్నవాడు తలిదండ్రుల దగ్గరనుండీ జారు[illegible]. వాడికోసం ఆందోళనతో వెదికారు. చివరికి

వాడు సూటిగా అమ్మగదికి ఉడాయించాడని కనుక్కు న్నారు. అనాహూతంగా అమ్మ వద్దకు చొచ్చుకురావటంలో అతడు మర్యాదను ఉల్లంఘించినందుకు వారు సహజంగా ఇబ్బందిపడ్డారు. అంతకు మించి ఆ పిల్లవాడు ఇంతకుముం దెరుగని చొరవతీసుకొనే చర్యకు వారు పులకరించారు. అన్నింటికీ మించి, మాటాపలుకూ లేకుండా వారి గుండెల్లోకి అమ్మ ప్రవేశించిన రహస్య రీతిలోనే ఆ కుర్రవాని హృద యంలోనికి అమ్మ చొరబడిందన్న ఎరుకవల్ల వారు మితి మీరి ఆనందించారు.

నా స్వదేశమైన అమెరికాలో, మన స్తత్వ శాస్త్రం లోనూ, తత్సంబంధిత రంగాలలోనూ సుదీర్ఘమైన డాక్టరేట్ పట్టాను పొందితేగానీ, మానసికంగా ఎదగని వ్యక్తుల్నిగానీ, ఆవేశంలో గాడితప్పిన వ్యక్తుల్నిగానీ పరిశీలించడానికి నిపుణత గల్గినవారిగా ఎవరినీ సంభావింపరు. కానీ ఇక్కడ ప్రాథమిక విద్యాభ్యాసం కూడాలేని మతిభ్రమణానికీ, మాన సిక వ్యాధులకూ సంబంధించిన నూతన సిద్ధాంతాల విష యంలో పద్ధతిప్రకారం చూస్తే తప్పక అజ్ఞానియైన ఒకా నొకరు అత్యంత తీవ్రమైన అసహజ వ్యక్తులతో అప్రయ త్నంగా ధృఢమైన సంబంధాన్ని స్థాపించుకోగలరు: అమ్మను కేవలం గమనించడం ద్వారా ఆ నిపుణులెంతో నేర్చుకుంటారని నాకు గట్టి నమ్మకం. మనిషికీ మనిషికీ ఉన్న అన్ని అడ్డంకులకూ విశ్వజనీనమైన పరిష్కారం

'ప్రేమ' అనేది వారు నేర్చుకునే అత్యంత ప్రధానమైన విష యం అని అనటంలో ఏ సందేహమూలేదు. మనం అందరం ఎక్కడ ఒకేరీతిగా ఉంటామో అక్కడ అమ్మ కేంద్రీకరించి మనం పంచుకునే మానవత్వపు ఎరుకకు మనలను మేల్కొల్పుతుంది. నిరంతరం అభివృద్ధిచెందే ఎంతటి నైపుణ్యం గాని, ఎంతటి సిద్ధాంతాలు గానీ సాధించటం అసాధ్యమైన ఒకానొక విషయమిది.

నేను చెప్పినట్లు, జిల్లెళ్ళమూడి చేరిన విభిన్న రకాల వ్యక్తుల మధ్య అసాధారణస్థాయిలో ఉంటే ఈ సమన్వ యంలో ఇది గోచరిస్తుంది. తొలిరోజులలో అమ్మ గ్రామంలో చిన్న పూరింట్లో ఉంటున్నప్పుడు సహజ శత్రువులైన జంతు వులు - ఎలుకలు, పిల్లులు, పాములు, కుక్కలు ఇటూ అటూ తిరుగుతూ అమ్మచీర చెంగుమీద కలిసి ఆడుకోవటంచూసిన యాత్రికులు ఆశ్చర్య పోయేవారు. అప్పుడప్పుడు అవి విభిన్న జాతులకు చెందినవనే విషయం మరచి ఒకదాని నుండి మరొకటి పాలు త్రాగుతూ కూడా ఉండేవి. ఆలోచనా శక్తిగల జంతువులమైన మనకు, మన జంతు సోదరులకన్నా దురభిమానాలపట్ల మంకుపట్టు ఎక్కువని ఒప్పుకోక తప్ప నప్పటికీ, తనయొక్క మానవ సంతతికి అమ్మసాన్నిధ్యంలో ఇంచుమించు జరిగేదిదే. ఆ సన్నిధియొక్క నిర్మలమౌనంలో అద్భుతమైన దర్శనం కొనసాగే మనోహరమైన సమయంలో

అల్పంగా సారహీనంగాతోచే జాతి, సంస్కృతి,వ్యక్తిత్వము సిద్ధాంతాల వైవిధ్యాలు కరిగిపోతున్నట్లు మనకు ఆశ్చర్యా నుభూతి కల్గుతుంది.

*                *                *

మూడవ అంతస్తులో అమ్మ గది ప్రక్కన చెదురు మదురుగా కూర్చున్న పదిపన్నెండుమందిగల గుంపు మధ్య మంచంపై పడుకొనిగాని, పచార్లుచేస్తూగాని, మాట్లాడుతూ గాని అమ్మ గడిపే సాయంకాలపు అద్భుత గడియలలో ఈ ఆత్మల యదార్ధ సమ్మేళనం మహిమాన్వితమై కన్పిస్తుంది. పగటి కార్యక్రమాల, ఆలోచనల, 'పథకాల అవిరళస్థితి క్రమంగా అంతరిస్తుంది. విస్తారకలశంవంటి నిశీథపు అంతరిక్షం మనలను మనలోనికి ఎలుగెత్తి పిలిచే ఆదిమ గర్భంవలే ఉంటుంది. నిదానంగా ప్రతివిషయమూ అనుగ్రహాలతో నిండిపోతుంది. ప్రతిబంధకాలేవీ లేకుండా ప్రజలు వస్తూపోతూ ఉంటారు. సాష్టాంగపడుడూంటారు. కూర్చుంటూంటారు. నడినెత్తిన ఎంతోఎత్తున వేగంగా నిశ్శబ్దంగా సాగే దట్టమైన మబ్బులచాటున వెన్నెల ఆడే దాగుడు మూతల ఆటలు పునరావృతమౌతూంటాయి. దూర తీరాలలో మెరుపుల శాశ్వత నృత్యం వాటినీడలలోని దీపికల వలె దట్టమైన మేఘాలను కాంతివంతం చేస్తూ ఉంటాయి. తన ప్రసంగంలో పెద్దపెద్ద విరామాలతో, సుతిమెత్తగా,

విశాలమైనరీతిలో అమ్మ మాట్లాడుతుంది. ఆ మౌనంలో దూరానికి స్పష్టంగా వినిపిస్తూ అమ్మ మాటలు ఆ రాత్రి లాగే హాయికొలుపుతూ ఉంటాయి.

కొన్ని గంటల క్రితమే తిరుపతి దేవస్థానం చూసుకొని ఇంటికి వెళ్తూ టూరిస్టుబస్సు దిగిన యాత్రికులు నున్నని గుండ్లతో ఒకరి తర్వాత ఒకరు అమ్మముందు సాగిలపడే ముమ్మరంగాను, తీవ్రంగాను ఉన్న పగటి దర్శన సమ సమయానికంటే పూర్తిగా ఎంతటి భిన్నమైన లయ ఉందిప్పుడు ? గుంపులుగా ఉన్న జనంతో, పసిపిల్లల ఏడ్పులతో, వారి పిల్లలకు అరుస్తూ సూచనల నిస్తున్న తలిదండ్రులతో, వాద్యబృందంతో సాగే అమ్మ నామసంకీర్తనతో క్రిక్కిరిసిన అమ్మ దర్శనమిచ్చే వరండాలో అమ్మ సింహాసనంపై ప్రజాసమూహం ముందు గంభీరంగా నిర్లిప్తంగా కూర్చుని, రణగొణధ్వనుల తుఫాను మధ్య సత్యమైన అచల నేత్రంలాగా కనబడింది.

సందెచీకట్లు క్రమ్మేప్పటికి, ఆనాటికి వచ్చిన యాత్రికులందరూ వెళ్ళిపోయారు. సహజ సాన్నిహిత్యం దృశ్యానికి తిరిగి వచ్చింది. వస్తుప్రదర్శన శాలలో అరుదైన నమూనావలె అమ్మ వంక జరపే వింతచూపులుగాని, ఆలయంలోని విగ్రహానికి ఉచితంగా తోచే మితిమీరిన వేడికోళ్లతోకూడిన భక్తి తత్పరతగానీ ఇంకేమాత్రంలేవు.

ఇప్పటి వాతావరణం ఒకచిన్న కుటుంబ సమావేశం మాదిరిగా ఉంది. నక్షత్రాలక్రింద ప్రతిఒక్కరూ ఏకాంతంగా కూర్చుని ఆత్మావలోకనం చేసుకుంటూ, మంచంచుల్లా ఉన్న వారి మంద్ర ప్రసంగాలవలెనే ఆ నిశ్శబ్దంలో అంతటా వ్యాపించిన ధ్యాన తరంగాలను పంచుకుంటూ ఏదోవిధంగా మిగతా వారితో బంధింపబడి ఉంటారు. ఇంకా ఎంత ఎక్కువ సమయం అమ్మ దగ్గిర కూర్చుంటే, అమ్మ సాన్నిధ్యపు కేంద్రాకర్షణశక్తి అంత నిర్నిరోధమౌతుంది. కొద్ది సమయం లోనే అప్పుడప్పుడు పలికేమాటలు నశించి మౌనం యొక్క మోహనత నిరంతరాయం అవుతుంది.

అమ్మ సన్నిధిలో మౌనం దిశగా ఈ అసంకల్పిత మైన ఆకర్షణ విశ్వజనీనమైన అనుభవం. 1975 లో జిల్లెళ్ళ మూడికి దూరంగా అమ్మ చేసిన సుడిగాలి బోలిన పర్యటన లలో కొన్ని సందర్భాలలో యాభై వేలు లేక లక్షమంది ప్రజలకు దర్శనమిస్తూ ఎత్తైన వేదిక ముందు కూర్చుండే దనీ, మహాసభయావత్తూ సూదిపడితే వినపడేంతటి నిశ్శబ్దం రాజ్యమేలేంతవరకు క్రమక్రమంగా ఆ జన సమూహం మరింత మరింతగా శాంత పడేదనీ అమ్మ యాత్రలో పాల్గొ న్నవారు నాకు చెప్పారు. ఎంతటి అమూల్యమైన దృశ్యాలు అయి ఉండాలవి! వారి నినాదాలతో వైయక్తిక ఆకర్షణ లతో గుంపుని ఉన్మాదావస్థకు తేగల తనవంతు వ్యక్తుల్ని

ప్రపంచం చూసింది. బలాత్కరించే తమ మాటల ఇంద్ర జాలంతో 'నశించాలి' 'వర్ధిల్లాలి' వంటి ఉద్రేకపు అరుపుల్ని లేవదీయగలవారికి ఏనాడూ కొదువలేదు. కాని బ్రహ్మాండమైన జన సమూహాన్ని గంభీర మౌనంలోకి సద్దుమణిగేట్లు చేయటం, గంటసేపు అంతకు ఎక్కువ సమయమే ఆస్థితిలో ఉంచటం నిస్సందేహంగా ఒక దుర్లభమైన వరం. అందులో మరీ అవసరమైనవరం కూడ.

అమ్మవంటి మూర్తి చుట్టూ విస్తరించే మౌనం ఏరకంగానూ నిషిద్ధ సిద్ధమైన ప్రక్రియగాగాని, బలవంతంగా రుద్ధబడే ప్రక్రియగాగాని కాదని మరొక్కసారి నొక్కి చెప్పాల్సిఉంది. ఉదాహరణకి క్రైస్తవ గురువు గంభీరంగా "ఇప్పుడు మనం ప్రార్థిద్దాం" అని ప్రకటించినప్పుడు చర్చిలో ఆవరించే నిష్ఠాపూరితమైన నిశ్శబ్దం వంటిదికాదది. అచ్చెరువుగొలిపే మంచుతో కప్పబడిన పర్వతశిఖర దృశ్యమూ, ఉష్ణదేశపు సాయం సంధ్యాకాలపు రంగరంగుల దీప్తిమత్వమూ మనకు తటస్థ పడినప్పుడు సహజపూజ్య భావంవలన మనలో కలిగే ప్రతిక్రియవంటిదీ మౌనం. మాటలు అనావశ్యకంగానూ, అప్రశుతిగానూ ఉండేవిధంగా మానవభాషకు అతీతమైనదాని సాన్నిధ్యంలో మనమున్నాం.

* * *

పారమార్థికమైన మౌనాన్ని గూర్చి, ప్రత్యేకించి ప్రాచ్య ధ్యాన విధానాలను గూర్చి సాధారణమైన అపోహ ఒకటి ఉంది. వానిలో ఒకరకమైన శూన్యతను చూస్తుందది. పై విధానాలతో మాటలు, సూత్రాలు, సులభంగా అందించే విషయమేదీ లేదన్నది నిజమే. పరిచితమైనవేవీ లేనప్పటికీ, అదేసమయంలో ఒక అతీతజ్ఞానంతోనూ, ఒక శాంతితోనూ, ఒక ప్రశాంతతతోనూ పూర్తిగా అవి నిండి ఉంటాయి. స్పష్టమైన నిర్వచనానికి అతీతంగా ఉన్నంతమాత్రాన అది ఏరకంగానూ నిజంకాకపోదు.

మాటకు, ఆలోచనల పరిధికి అతీతంగా ఒక వస్తువు ఉంటుందనడం భౌతికవాదికి ప్రశ్నింపదగిన ప్రబోధంగా తట్టుతుంది: ఏ సందర్భంలోనైనా అది అసాధ్యం కనుక దీనికి ఋజువు అందించే ప్రయత్నం చెయ్యాలని నా ఉద్దేశ్యంకాదు. ఏసుప్రభువు ఋషిలాగా పలికినట్లు "చెవులున్నవాళ్లని వినమనండి." ఆముష్మికానుభవసీమ ఉన్నది అనేది ఒక తర్కబద్ధమైన సిద్ధాంతం కాదుకానీ ఒక రూఢి అయిన అనుభవం. ఆ అనుభవం కల్గినవారికి ఏ తర్కమూ అవసరంలేదు. లేనివారికి ఏతర్కమూ సాధ్యపడదు. ఎంతటి రూఢి అయిన నిరీశ్వరవాది అయినా యదార్థమైన పారమార్థికానుభవానికి చలించకుండా ఉండలేడు. ఒకరికి నమ్మకం ఉండటం, లేకపోవడంతో సంబంధంలేకుండా ఒక

వ్యక్తిలో దాగిన ఆధ్యాత్మికత మేల్కొనడానికి తరచూ యోగితోటి సాహచర్యం సరిపోతుంది అని జిల్లెళ్ళమూడిలో చాలా సందర్భాలలో నేను గమనించాను.

సత్సంగంలోని అద్భుతశక్తిని గూర్చి స్మృతులు ఎంతోగొప్పగా ఉటంకించటం భారత దేశంలో చాలా కాలంగా తెలిసిన వాస్తవం. ("సత్యంతో ఉండటం" అని దాని ప్రతి పదార్థం. అంటే సత్యం మూర్తీభవించిన వ్యక్తితో ఉండటం అని చెప్పటం అన్నమాట.) దగ్గరగా వచ్చిన ఎండు కట్టెను మండుతూన్న నిప్పు మండించే విధంగానే గురువు తన పారమార్థిక స్థితి యొక్క రుచిని తన సాన్నిధ్యంలో ఉన్న వారికి నిజంగా అందిస్తాడని చెప్పబడింది. దానిలోని నిజం నేను చాలా సందర్భాలలో అనుభవించాను. చైతన్యం యొక్క ఈ మార్పిడి సాధించగల్గడానికి ఎన్నో విభిన్న పద్ధతులు లేక ఉపదేశాలు ఉన్నట్లు సంప్రదాయ గ్రంథాలు చెప్తాయి. వీటిలో మంత్రం ద్వారా, మౌఖిక బోధనల ద్వారా ఉండే ఉపదేశాలు కొన్ని, ఇంకా సూటియైన భిన్న పద్ధతులలో చేరినవైన స్పర్శ దీక్షలు దృగ్దీక్షలు కొన్నీ ఉన్నాయి. ఆధ్యాత్మికతను మేల్కొల్పే రకరకాల విధానా లన్నింటిలో అత్యంత శక్తివంతమైనదీ,అపార్థాలకు తక్కువ అవకాశమిచ్చేదీ మౌనమైన ఉపదేశమే. అన్ని పద్ధతుల లోకీ అదానమూ, ప్రదానమూ, కర్తా, కర్మా: ఉద్ఘాట

నమూ, ఖండనమూః అనే ద్వంద్వాలకు అతీతంగా ఉండేది మౌనం మాత్రమే. అందుకే తన బోధనలలోని అత్యంత ఉదాత్తమైన ప్రకటనను గురువు మౌనంగానే చేస్తాడు.

గురువుయొక్క మౌనం సామాన్య మానవుని మౌనం వంటిదికాదని మనం గుర్తుపెట్టుకోవాలి. (అదే అయితే నోరు కుట్టేసుకుంటే మనం అందరం యోగులుగా మారగలం.) ఉత్కృష్టమైన భావంలో నిజానికి అది మౌఖికమైన సందేశం లేకపోవటం కాదు. తద్భిన్నంగా సిద్ధ వ్యక్తికి తను మాటాడేప్పుడూ, మౌనంగా ఉండేప్పుడూ, కూడా ఒకే విధంగా ఉండే ఒక మానసిక స్థితి అది. ఈ రెండు సందర్భాలలోనూ మనం వారి సాన్నిధ్యంలో ఎప్పుడు ఉన్నా మనలను ప్రభావితం చేసే భంగపాటులేని ప్రశాంతత ఉంటుంది. ఆ ప్రశాంతతయే వారి మౌనం. మౌనం వారు చేసే ఒక కలాపం కాదు. మౌనమే ఆయి ఉన్నారు వారు.

మళ్లీ నా స్వీయానుభవానికి వస్తే అమ్మ తరచు సౌమ్యంగా అప్పుడప్పుడు గంటల తరబడి, అంతరంలేని విధంగా ముచ్చటిస్తుండగా నేను చూశాను. గమనిస్తుంటే, మాటలూ, సంజ్ఞలూ ఒక ప్రవాహం బయట నుండి, తన గుండా జాడ లేకుండా, అగరుధూపంలాగా, నీటి మీది వ్రాతలాగా దాటి వస్తున్నట్లు కనుపిస్తుంది. ఆంతర్యంలో అమ్మ పూర్తిగా అంటకుండా మిగులుతుంది. తప్పనిసరిగా

చివరికి, మొదట్లో ఎంత స్వచ్ఛంగా ఉందో అట్లాగే కనపడు తుంది. మాటలూ, చర్యలూ అన్నీ హంసరెక్కల నుండి నీరు ప్రవహించినట్లు అమ్మ మీదుగా దాటిపోతాయి. ఎంతో అసాధారణమైన ఓపికతో రోజుకి పది పన్నెండు గంటల పైగా పనిచేస్తే, ఎన్నో అఖిలభారత ఒలింపిక్ క్రీడాసంస్థలలో నేతృత్వం వహించే ప్రముఖుడూ, హైదరాబాదు నగరం నుండి వచ్చిన యువకుడూ, బలశాలీ అయిన రాష్ట్ర ప్రభుత్వ మంత్రి ఒకరు, అమ్మ తన పర్యటనలో తమ నగరానికి వచ్చినపుడు ఆస్పత్రులు, స్కూళ్ళు, జైళ్ళు, పూరి గుడిసెలు, దర్శించే ఆమె నిరంతర కార్యక్రమం నిర్వహించటం అసాధ్యమైనటువంటిదని నాతో చెప్పారు. దానికంటే అసాధారణమైన విషయం ఏమంటే అమ్మ ఏ కొద్దిపాటి బడలికనూ ఎప్పుడూ కనపరచలేదు. జీవితం అమ్మను అనూహ్యంగా ఎంత తక్కువ శిథిలపరచిందో అంతుచిక్కాలంటే అరవై సంవత్సరాల వయసులో ఒక్క ముడతగానీ, ఆందోళన రేఖగానీ లేకుండా పసిపిల్లను పోలిన అమ్మ ముఖకవళికలను మనం చూడవలసిందే. లేదా రైతింటి ఆడపడచుగా సంవత్సరాల తరబడి ఒత్తిడి చేసే కాయకష్టం తర్వాత కూడా అక్షరాలా అప్పుడే పుట్టిన పవిపాపకుండేంత మృదువుగా, సున్నితంగా ఉన్న అమ్మ కాళ్లకు, చేతులకు అబ్బురపడాల్సిందే.

ప్రపంచంలో 'కృషిచేయటం' అంటే అనివార్యంగా మనంకూడా ప్రపంచం వల్ల ప్రభావితులం కావటమే. ఈ సమీకరణం అమ్మ విషయంలో వర్తిస్తున్నట్లు గోచరించదు. పైకి కనబడే దానికి భిన్నంగా అమ్మ ఏదీ చేయదు. దేని వల్లా ప్రభావితం కాదు.

అలా అంటే విరుద్ధంగా భాసించే నాణెం యొక్క రెండవ ప్రక్కకు మనలను తెస్తోందిది. తన కర్మణ్యతలో అకర్మణ్యంగా, ప్రసంగంలో మౌనంగా ఋషి మిగులుతున్నాడూ అంటే లావ్‌త్జు ప్రవచించిన వింతసత్యం ఒప్పుకు తీరాల్సిందే. "తన అకర్మణ్యత చేత ఋషి అందరినీ పాలిస్తున్నాడు." ఈ సూత్రాన్ని వ్యాఖ్యానిస్తూ సమకాలీనుడైన రమణమహర్షి ఇలా వివరించాడు.

"అకర్మణ్యత అంటే నిరంతర కర్మణ్యత. శాశ్వతమూ పరమతీవ్రమూ అయిన క్రియాశీలత వల్ల ఋషి గుర్తింపబడతాడు. అతి శీఘ్రంగా గిరగిర తిరిగే ఉపరితలపు నిశ్చలత్వం వంటిది ఋషిలోని నిశ్చలత్వం. దాని వేగం కళ్లు అనుసరించలేనంత ఎక్కువగా ఉన్నందున అది కదలకుండా ఉన్నట్లు కనబడుతుంది".

అమ్మను గమనిస్తున్నపుడు ఈ సత్యం స్పష్టతరమౌతుంది. క్రియారహితంగా ఉన్నట్లు మనకు అనుపిస్తు

న్నప్పుడుకూడా, అక్కడ అద్వితీయమై ఉప్పొంగే ఒక జాగృతీ, సూక్ష్మంగా ఉన్న తీవ్రతా తప్పక ఉన్నాయి. అటువంటి విషయాలకు స్పందించే వారు ఈ లక్షణాన్ని అమ్మ నుండి నిరంతరం ప్రకాశించే ప్రత్యక్ష కాంతి మండలంగా గ్రహిస్తారు. ప్రపంచంలో వివిధ మతాలలో జ్యోతిర్వలయంతో ఋషుల నెందుకు చిత్రిస్తారో అర్థంచేసుకోవటం సులభం. ఇదేమీ సుందరమైన అలంకారం ఎంతమాత్రం కాదనీ, అంతర్దర్శనానికి ఒక సాధువు నిరంతరం ఉబికి విరజిమ్మే ప్రకాశపు మూలాధారంగా ఎలా కనుపిస్తాడో దాని వాస్తవ చిత్రీకరణమనీ నేను ఇప్పుడు అవగతం చేసుకున్నాను.

నేను తరచూ అమ్మతో ఉన్నప్పుడు ఈ ఆధ్యాత్మిక సూక్ష్మ శక్తికి అనువైన గ్రహీత కోసం అమ్మ శోధిస్తున్న భావన నాకు కలుగుతూంటుంది. దూరానికి మొత్తంమీద నిశ్చలంగా ఉన్నట్లనిపించవచ్చుగాని, సమీపానికి జరిగితే ఎలా తన కళ్లను వడిగా, శాంతంగా జనసమూహాన్ని పరీక్షిస్తూ వ్యక్తి నుండి వ్యక్తికి గ్రహణశీలత తనకు స్ఫురించే వరకూ కదిలిస్తూ, అప్పుడు క్షణకాలం తన దృష్టి అక్కడ నిలపటం మనం గమనించటం సాధ్యపడుతుంది. తన ముందున్న జపసమూహంలో వ్యక్తినుంచి మరొక వ్యక్తికి తన సావధానతను సున్నితంగా మారుస్తూ దర్శన కాలం యావత్తూ తన ముఖ కవళిక క్షణక్షణం ప్రతిస్పం

దించే లక్షణాన్ని కనపరుస్తుంది. ఈ సమూహాన్ని అన్వేషించటంలో ఒక విషయాన్ని ఇతరులతో పంచుకోవాలనే తపనను ఎవరైనా గ్రహిస్తారు. అయినా బహుకొద్ది మంది అటువంటి వారెవరైనా అంటూ ఉంటే, ఆ కానుకను స్వీకరించే స్థితిలో ఉంటారు. అమ్మచూపుని అందుకోగల్గినవారు ఏదో ఒక అనిర్వచనీయమైన వస్తువల్ల అధికులమైనట్లు భావిస్తారు. గంటలూ రోజులూ నిలచి ఉండే ఒకానొక అంతరంగ వికాసాన్ని అనుభవిస్తారు.

అమ్మ దర్శన మీయటం గమనించే స్పందనలేని పరిశీలకుడు అక్కడ పెద్దగా ఏమీ జరుగుతున్నట్లు భావించడు. అతివేగంగా, గిరగిర తిరిగే బొంగరం నిశ్చలంగా ఉన్నట్లు కనిపిస్తుంది. కాని అగోచరమైనంత మాత్రాన ఆ కదలిక కదలిక కాకపోదు. తనచుట్టూ ఉన్న వారి పరిణామం కోసం శక్తి వంతమూ అదృశ్యమూ అయిన మౌనప్రభావం అమ్మ నిరంతరం బయల్పరుస్తూ ఉంటుందన్న విషయం నా స్వానుభవంతో ధృవపరచుకున్నాను.

ఒక మహనీయుని గురించి, ప్రపంచంమీద అతని ప్రభావాన్ని గురించి పైపైన జరిగే అతని చర్యల నాటకీయతను చూసి ఎంతవరకు మనం నిజంగా అర్థంచేసుకోగలం? కనపడుతున్నది సముద్ర ఉపరితలంలో కనిపించే మంచు పర్వతపు కొనకంటే తక్కువైందనీ, ఇంద్రియ పరిధి

కఠినతంగా కలనైనా ఊహించని శక్తివ్యూహం మొత్తం పని చేస్తున్నదనీ, తనదగ్గరగా ఉన్నవారినీ, సుదూరప్రాంతాలలో ఉన్నవారినీ కోలుకునేట్లు చేయటం, స్పృశించటం. వారికి బోధించటం, శిక్షణగరపటం, వారిలో పరిణామం తేవటం వంటి పనులు ఆశక్తివ్యూహం చేస్తుంటుందని నేను చెప్పటానికి సాహసిస్తాను. భక్తులు అనుభవించిన అమ్మ మహిమాన్విత శక్తులు అనబడే వాటి నిదర్శనాలను పక్కకు పెట్టి ప్రస్తుతానికి మాత్రం మరింత భౌతికమై అంతే ఆశ్చర్యం కల్గించే అమ్మ చర్యారీతులవంకచూస్తే ఉపయోగకరంగా ఉంటుంది.

చేస్తున్నపనిలో క్రమం మర్చిపోకుండా, ఒకే సమయంలో రెండు, అంతకంటే ఎక్కువైన కార్యకలాపాలలో పాల్గొనగల అమ్మతీరు నన్నెప్పుడూ ఆశ్చర్యపరచే విషయాలలో ఒకటి. లోతైన పారమార్థిక చర్చలో అమ్మ పాల్గొంటూ ఉండవచ్చు, అయినా తన సన్నిధికి వచ్చి, సన్నిధినుండీ పోయే వారికదలికలను గమనించకుండా ఉండదు. తలపంకించటం ద్వారానో, సైగతోనే, భోజనం చేయండనో, కాఫీ ఇవ్వండనో సంభావిస్తూనే ఉంటుంది. అదే సమయంలో ఎవరైనా అమ్మపాదాలు రాస్తూనో, కాళ్లు వత్తుతూనో ఉంటే, ఆ పరిచేర్యలో వారు నిమగ్నమైన దాని కంటే ఎంతో ఎక్కువగా అమ్మే తనమనను శృతి చేసిందని

స్పష్టమైన భావం కలిగే రీతిలో : ఎక్కడ, ఎందుకు, ఎంత వత్తిడి కల్గించాలో, మరచిపోయింది ఏ వేలినో, పలుకులేని చిక్కైన సూచనల పరంపర తన పాదాల, చేతుల వివిధ మైన కదలికల ద్వారా ఇస్తూంటుంది. ఒళ్లు పట్టటం కాని, గాలి విసరటం కాని, ఊడవటం గాని ఏ పని ఐనా అమ్మకు చేయటమంటే ఆ పని సక్రమంగా, నైపుణ్యంగా, ధ్యాసతో చేసేతీరులో శిక్షణ ఇయ్యబడటమేనని నేను తెలుసుకున్నాను. అయినా తనేం చేసినా ఎంత శ్రద్ధగా, సావధానంగా చేస్తోందో తన చుట్టూ ఉన్నవారిలో అంతటి శ్రద్ధనూ, సావధానతనూ ప్రోత్సహించే ప్రయత్నం చేసే తీవ్ర పరిశీలకుడైన చండశాసనునివలె అమ్మ ఉండదు.

ఈ విషయంలో అమ్మకు ఆమే శ్రేష్ఠమైన ఉదాహరణ. చాలా సందర్భాలలో వచ్చిన వారికి తానే స్వయంగా అన్నం పెట్టడంలో గొప్ప ఆనందం పొందుతుంది. ఎంత పెద్ద జన సమూహమైనా సరే, ప్రతివ్యక్తి యొక్క అవసరాలకూ కోరికలకూ అసాధారణమూ, తీక్ష్ణమూ అయిన స్పందనని ప్రదర్శిస్తుంది. ఎవరిదగ్గర మంచినీళ్లయిపోయాయో, ఎవరు రెండవ విడతకు సిద్ధంగా ఉన్నారో, మూడవ వ్యక్తి మసాలాతో ఘుమఘుమలాడే కూరమనసు పడుతున్నాడో లేక సాత్వికంగా ఉండే కూరకోరుతున్నాడో అమ్మ వెనువెంటనే తెలుసుకుంటుంది ఎన్నో రకాలు గల

దాక్షిణాత్య (ఆంధ్ర) భోజనంలో ఒక వ్యక్తికి ఏదైనా ఒకటి రుచించనిదైతే అమ్మ ఎవరూ చెప్పకుండానే తెల్సుకుంటుంది. మరోటి వండమని వంటశాలకు సూచిస్తుంది. ఎవరైనా ఒకరకంగా తినటం అలవాటుపడి ఉంటే తన సహాయకునికి ముందుగానే చెప్పి ఆ ఏర్పాటుచేస్తుంది. ఉదాహరణకి – "పోయి నిమ్మకాయ పచ్చడి తీసుకురా. ఫలానావారికి పెరుగన్నంలో నిమ్మకాయపచ్చడి నంజుకోవటం అలవాటు." తన ఇంట్లో తిండి అలవాట్లను అంతబాగా అమ్మ ఎలా తెలుసుకున్నదా అన్న విషయం ఆతడికి అగమ్యంగా ఉంటుందని చెప్పనక్కరలేదు.

అత్యంత అంకిత భావం కల గృహస్తుకాని, గృహిణీ కాని, అమ్మకు తన అతిధుల అవసరాల యందుగల ప్రేరణాత్మక గ్రహణశక్తి విషయంలో సరితూగ గలరని ఊహించలేంగానీ ఇంకా అమ్మ ఎంతో చిన్న వివరాలకు గూడా ధ్యాసతో, పూర్తి శ్రద్ధతో అందరికీ భోజనం వడ్డిస్తూ మనందరికీ ఆదర్శప్రాయురాలు అవుతుంది. క్రీస్తుప్రభువు తను పాదాలను కడిగినప్పుడు అతని చర్యలోని అణకువకే కాకుండా, సంకేతప్రాయమైన ఆప్రక్షాళనలో కనపడే అత్యంత భక్తిశ్రద్ధలకు కూడా నిశ్చేష్టులై అతని ప్రధమ శిష్యులు ఖచ్చితంగా పైవిధంగానే భావించి ఉండిఉంటారని నేను తేలిగ్గా ఊహించగలను. భౌతిక ప్రపంచాన్ని మరచి

జీవితంలోని వాస్తవ సమస్యలకు చాలా దూరంగా ఉండే వారిగా సాధారణంగా దర్శనమిచ్చే పవిత్ర యోగులను ఖండించే తీరులో అమ్మ చర్యలూ, జీవితమూ ఉన్నాయని నాకు పరిశీలించగా బోధపడింది. తప్పించుకు వదిలివేయ టానికి అమ్మకీ జగత్తు మిథ్యకాదు. మహోన్నత ప్రేమాద రాలకు అర్హమైన భగవంతుని ప్రత్యక్ష రూపావిష్కరమే.

లౌకికమైన విషయాలను గూర్చిన వివరాలలో అమ్మకు గల ఆశ్చర్యకరమైన శ్రద్ధలోని ఒక కోణమే అమ్మకు గల అద్భుత బలవత్తర జ్ఞాపకశక్తి. అమ్మ చూసిన వేలాది మంది జనులలో ఎవరినీ, ఎప్పటికీ అమ్మ మరువ దనీ, ఏరోజు వచ్చిందీ, ఎటువంటి వస్త్రాలు ధరించిందీ, ఆ దర్శనానికి సంబంధించిన అన్ని వివరాలనూ అమ్మ ఎల్లప్పుడూ చెప్పకల్గుతుందని చెప్తారు. ఆ సంఘటన జరిగిన చాలా సంవత్సరాల తర్వాత, నెల్లూరిలో నా మొదటి దర్శనానికి నేను ధరించిన నీలం రంగు పూర్తి చేతుల చొక్కాకు గల డిజైను అమ్మ వర్ణిస్తుంటే ఈ వాస్తవం నాకు వ్యక్తిగతంగా ధృవపడింది. నేను ఆ చొక్కాను గూర్చి చాలా కాలం క్రితమే మరచాను కానీ అమ్మ వర్ణన మూలాన ఒకప్పుడు నాకు ఆచొక్కా ఉండేదన్న లీలామాత్రపు జ్ఞాప కం ప్రబుద్ధమైంది. చీరాల వాస్తవ్యుడైన శ్రీ లింగేశ్వరరావ్ అనే భక్తుడు జిల్లెళ్లమూడిలో అమ్మతో తన మొదటి సమా

వేశంలో దశాబ్దాల క్రితం తను బాలుడిగా ఉన్నప్పుడు అమ్మ తనకొకసారి చూపిన విషయం ఎంత సాధారణంగా, నిర్లిప్తంగా అమ్మ ప్రస్తావించిందో చెప్పాడు. అమ్మ కథనం ప్రకారం తన బాల్యంలో అమ్మ ఆవూరు వెళ్లినపుడు ఒక సారి బాల్య స్నేహితులలో ఆయన పేకాట ఆడుతుండగా తెరచి ఉన్న తలుపులోంచీ తన భవిష్యత్ భక్తుని క్షణకాలం పొంచి చూసింది. లింగేశ్వరరావ్‌కి అది జ్ఞాపకం లేదు. వృద్ధవయస్కురాలైన ఆయన తల్లితో ఆరాతీస్తే అమ్మ వివరించిన స్థలంలోనే కొద్దిమంది సహచరులతో ఆవయసులో పేకాట ఆడే అలవాటు ఆయన కుండేదని ఆమె ధృవపరచింది.

తన దర్శనార్థం వచ్చిన ఒకరితో అమ్మ ఆయనను 1911వ సంవత్సరంలో (అమ్మ పుట్టింది 1923 లో) రావలసిన ఒకానొక రైలుకోసం ఎదురు చూస్తూ నిల్చుండగా ఒక గుంపులో చూశానని చెప్పిన సంఘటన అర్థంచేసుకోవటం మరింత కష్టమయిన విషయం. తన బంధువులను అడిగి చూస్తే అమ్మ చెప్పిన తేదీనే మంగళగిరి నృసింహస్వామి దేవాలయ ఉత్సవాలలో వంటకు (వడ్డనకు) స్వచ్ఛంద సేవకుడిగా పాల్గొనటానికి అతను నిజంగా ఒక రైలు ప్రయాణం చేశాడని తెల్సుకున్నాడు. "నేనెప్పుడూ మీ వెన్నంటే ఉంటాను" అని బహుశా అమ్మ చెప్పే తీరు

ఇదేనేమో. ఎందుకంటే ఇందులో ఏమి ఇమిడి ఉన్నా ఇది మాత్రం ఎంత చిత్రం తీసినట్లుగా ముద్రపడినట్లున్నా కేవలం జ్ఞాపక శక్తికి సంబంధించిన విషయంకాదు.

కాలంలో అంత ఎడమైన విషయాలను ఎలా గుర్తుకు తెచ్చుకోగలవని అమ్మను ప్రశ్నిస్తే "అమ్మకు మరుపులేదు" అని జవాబిచ్చింది. తానెప్పుడైనా గ్రహించినదాన్ని అప్పటికప్పుడు స్ఫురణకు తెచ్చుకోగల కేవల సామార్థ్యం కంటే మించిన దెంతో ఇందులో నర్మ గర్భంగా చెప్పబడిందని నేను భావిస్తున్నాను. ఒక పూర్ణమైన భావంతో తన జ్ఞానానికి ఏ హద్దులూ లేవని అమ్మ చెప్తున్నట్లు తోస్తుంది.

ఈ సర్వజ్ఞత సాక్షాత్కరించే వేళల్లో నిద్ర ఒకటి. భక్తులు అమ్మ మంచం చుట్టూ కూర్చుని, ఏదో ఒక విషయం గురించి నెమ్మదిగా కబుర్లు చెప్పుకుంటూ ఉండగా అమ్మ పెద్దగా గురకపెట్టూ నిద్రపోతున్నట్లు కన్పడుతూ, తాను మేల్కొన్న తర్వాత భక్తులు చర్చించిన విషయం మీద తన వ్యాఖ్యానం పొందటం సాధారణంగా జిల్లెళ్ళమూడిలో జరిగే సంఘటన. తన నిద్ర మన నిద్రలా పరిసరాల పట్ల స్పృహలేని అచేతనావస్థ కాదని అమ్మ ధృవపరుస్తుంది. అమ్మ విషయంలో అది (నిద్ర) ఏమిటో అన్నది, ఆ వ్యక్తిత్వం గురించి తెలియని ఎన్నో రహస్యాలలో ఒకటిగా నిలుస్తుంది. ఆ వ్యక్తిత్వం యొక్క ప్రతిచర్యా - నిద్ర

గానీ, జ్ఞాపకం గానీ, ప్రేరణకానీ, ఏకాగ్రత కానీ. పరిచిత సీమల నధిగమించి అద్భుతమైందిగా అతిలోక మానవతకు చెందిందిగా రూపొందుతుంది.

రచయితయొక్క జిల్లెళ్ళమూడి ప్రయాణాన్ని ఇప్పుడు పాఠకుడు ఒక అవలోకనం చేశాడుగనుక, అక్కడ తాను కనుగొన్న నిగూఢ వ్యక్తిత్వాన్ని పాఠకుడు తన కళ్ళతో సంక్షిప్తప్రదర్శనం పొందాడుగనుక, ఎవరి సాన్నిధ్యంలో తననుతాను చూసుకున్నాడో, ఎంతఎక్కువ కాలం అక్కడ గడిపితే, ఆ రహస్యగ్రంధి విప్పటానికి అంత సమ్మోహితుడయినాడో, పై పెచ్చు అంత బంధితుడయినాడో అర్థం చేసుకోగలడు. అమ్మను గురించి మరింత తెలుసుకున్నకొద్దీ, అమ్మ మరింత తక్కువ అర్థం అయినట్లు అభిప్రాయపడ్డాడు. అటువంటి అన్ని బౌద్ధిక వ్యామోహాలకు వలెనే, కేవలం అసాధ్యమయిన కార్యం, పంతంతో కూడిన పరీక్షలను నిరుత్సాహ పరచలేదు సరికదా వాటిని ముందుకు పురిగొలిపింది. ఆధారాల అన్వేషణకోసం, అమ్మ గురించి ఇంగ్లీషులో వ్రాసిన ప్రతివిషయం రచయిత నిదానించి పరిశీలించాడు. అమ్మ జీవితచరిత్ర వివరాలు పరిశోధించాడు. భక్తులతో మాటాడే అవకాశం ఉన్నప్పుడల్లా వారు చెప్పిన అద్భుతకథలను ఆసక్తితో విన్నాడు అన్నిటికంటె మించి, అమ్మ లక్ష్యానికీ, సందేశాలకూ అమూల్యమైన

వివరణగా తనకు తట్టిన బాధాకరమైన జెన్‌కథలవంటి అమ్మ బాల్యగాధను మాతృశ్రీ పాతసంచికలలో అతడు కనుగొన్నాడు. అవినిజమైన వైభవంతో ప్రకాశించేందుకు కొంచెం చెక్కడం, కొద్దిగా మెరుగుపెట్టటం మాత్రమే కావలసిన రత్నాలవి తనకు తెలిసినంతవరకు మానవజాతి పారమార్థిక సాహిత్యంలో ఒక మహనీయ వ్యక్తిగా ఒక శిశువు వికసించే క్రమానుగత వివరాలు అంత స్పష్టంగా, స్ఫూర్తివంతంగా ఎక్కడా భద్రపరచబడలేదు.

కాలక్రమేణా, అమ్మ అద్వితీయ జీవితం గురించి వ్రేళ్ళూనుతున్న నిశ్చయంతో, ఆకథను విస్తృత పాఠక లోకానికి అందించాలనే కోరిక పెరిగింది. పత్రికారంగంలో నాకుగల అనుభవం ఇది నేనే చేపట్టాలని భావించేట్లు చేసింది. ఎన్నో సహేతుకమైన అభ్యంతరాలు వాటంతటఅవే ముందుకువచ్చి ముగ్గులోకి అంతతొందరగా దూకటాన్ని నివారించాయి. నాకు భక్తిగౌరవాలు ఉన్నప్పటికీ, పట్టుచిక్కించుకునేందుకు ప్రయత్నించే క్షణంలోనే, అందు బాటుకు కొంచెం వెనుకకు జరిగేటువంటి ఒక విధమైన రహస్యంగా అమ్మ మిగిలిందనే వాస్తవం వీటన్నిటికంటె తక్కువదికాదు. అటువంటి మూర్తినిగూర్చి ఎలావ్రాయటం? నేను అసమగ్రంగా మాత్రమే అవగాహన చేసుకున్నదాన్ని ఇతరులకు వివరించగలనని నిజంగా ఆశిస్తున్నానా?

పై పెచ్చు అమ్మ హర్షిస్తుందా? లేక నాలాగా కొద్ది అర్హతలు గలవారు అటువంటి ప్రయత్నం చేయాలని ఆలోచించటమే అహంకారంగా భావిస్తుందా?

ఎన్నో నెలలు ఈ విరుద్ధ భావాలు అనిశ్చితంగా అంతర్గతంగా మసిలాయి. అప్పుడొకనాటి ఉదయం జిల్లెళ్ళమూడిలో ఒంటరిగా నాగదిలో కూర్చున్నప్పుడు, నేను ఎంతో బలంగా దేనివేపైతే ఆకర్షితుణ్ణయానో ఆపనికి, వెనుకాముందూ ఆడకుండా, ఉపక్రమించాలని చాలా బలంగా, అకస్మాత్తుగా నాకు ప్రేరణ కలిగింది. నేను వెంటనే ప్రారంభించి తీరాలి అని అనిపించింది. ఇదేదో తర్కబద్ధంగా ఆలోచించుకున్న విషయంకాదు. పని ప్రారంభించకుండా ఉండేందుకు గల సరైన కారణాలన్నీ అప్పుడూ, ఇప్పుడూ కూడా సవ్యమైనవిగానే ఉన్నాయి. ఏశక్తి అయితే తానొక విషయం సాధించాలని కోరేట్లు చేసిందో, అదే శక్తి తాను విజయవంతంగా పూర్తిచేసేట్లు చూస్తుందనే, పైకి అసంబద్ధంగా ఉండి, తరచు పూర్తిగా సమర్ధనీయంగా ఉండే భక్తుని ఊహచే అకస్మాత్తుగా ఇవి పారద్రోలబడ్డాయి.

ఎట్టకేలకు గ్రంథం వ్రాయాలని నిర్ణయించడంతో, అణచివెట్టి ఉంచబడిన స్ఫూర్తిస్రవంతి అన్నిదిక్కులకు గట్లు తెంచుకున్నట్లు తోచింది. ఒకానొక ఆనందోత్సాహంలో

ముంచెత్తబడ్డాను. పైకి ఎగసి వస్తూన్న ఈ సంతోషం మధ్యలో ఉండగా, మూడో అంతస్తునుంచి ఒక వార్తాహరుడు గుమ్మందగ్గరకనుపించి, "అమ్మ మిమ్మల్ని చూడాలనుకుంటోంది. దయచేసి సరాసరి రండి" అన్నాడు.

ఏమై ఉంటుందది? సంతోషంతో జరుగబోయే సంఘటనల ఊహలతో నిండిపోయి ఉన్నాను. నా బాల్యోత్సాహాల తరంగాల మీద మూడో అంతస్తుకి మెట్లమీంచి అక్షరాలా దూసుకుపోయాను. ఖాళీగాఉన్న, అమ్మదర్శనమిచ్చే హాలులో కూర్చుని వేచి ఉండమని వసుంధర చెప్పింది. కొన్ని క్షణాల తర్వాత, ఒక చేత అరటిపండుతో వంటగదిలో నుండి అమ్మ లోపలికి వచ్చింది. నా ముందు నుంచుని ఆపండు ఒలవటం ప్రారంభించింది. ఒక్కమాట అయినా వివరణ లేకుండా, తల్లి శిశువుకి పెట్టే విధంగా, ఒక దాని తర్వాత ఒకటి చిన్నచిన్న ముక్కలు నానోట్లో పడేస్తూ నాకు తినిపించింది. ఇది కాగానే, జరిగిన చిక్కు విడదీసుకోటానికి నన్ను వదలి అమ్మ మళ్ళీ నడిచి వెళ్ళిపోయింది. కేవలం ఒక అరటిపండు తినిపించటానికి మాత్రమే ఖచ్చితంగా అమ్మ నన్ను పిలవలేదు. అమ్మ తిరిగివచ్చి, తాను పిలిపించటంలో గల అసలు ఉద్దేశం ఎరుకపరుస్తుందని సగం ఎదురుచూస్తూ, కొంచెం దిగ్భ్రమతో కూర్చున్నాను. కానీ అటువంటిదేమీ జరగలేదు. ఒక రకమయిన కలవరపాటుతో నేను గదిలో నుండి బయటకు నడుస్తూండగా, అకస్మాత్తుగా

ఇప్పుడు జరిగిందేమిటో జ్ఞానోదయమైంది. "నీవు పుస్తకం ఆరంభించాలని నిర్ణయించుకున్నావు. వెంటనే అమ్మచేత పిలిపించబడ్డావు. అరటిపండు పెట్టటానికి కాదు, తన్మూలంగా నీ నిర్ణయానికి సంకేతప్రాయంగా ఆశీర్వదించడానికి.

ఆ ఆశీస్సు అనుగ్రహంతో, ఆరోజు మొదలు పెట్టిన ఆ పుస్తకం ఈ మాటలు టైపు చేస్తూండగా దాదాపు పూర్తి అయింది. నేను వివరించాలని ఊహించిన రహస్యం ఇప్పుడంత కంటె తక్కువ రహస్యంగా ఏమీలేదు. కనుక ఈ పుటలలో అమ్మను గురించిన విషయం ఏమయినా కనపడితే అది ఆ ఆశీర్వచన ప్రభావం వలన మాత్రమేనని నిశ్చయంగా చెప్పితీరాలి. ఈ పుస్తకం వ్రాసినంతసేపూ ఊహించని రీతులలో ఆ ఆశీస్సు నాకు దారి చూపిస్తూ ఉన్నదని భావించాను.

నా జిల్లెళ్ళమూడి యాత్రను గూర్చిన కథనం ముగిస్తూ, జిల్లెళ్ళమూడి ఎలా చేరానో, చేరినాక నేనేమి చూశానో నా భావాలను సంక్షిప్తంగా తెలిపే, మాతృశ్రీ మాసపత్రికకు నేను వ్రాసిన వ్యాసంలో కొంత భాగాన్ని చదువరులతో పంచుకుంటాను.

"జిల్లెళ్ళమూడిలో నిరపేక్షమయిన, అద్వితీయమైన ఒకానొక వస్తువు ఉంది. అటువంటి దానిని రచయిత మరె

క్కడా చూడలేదు. చాలా ఎక్కువ నిల్వలతో ఉన్న స్వదేశంలోని సూపర్ మార్కెట్లలో గాని, కలర్ టెలివిజన్ మీద గాని, గుహలవంటి గ్రంథాలయాలలోగాని, విశ్వవిద్యాలయాలలోని ఉపన్యాస మంటపాలలోగాని, ఇంకే రాచ మార్గాలలోగాని, నవీన విశ్వపు క్రిక్కిరిసిన ఆకాశమార్గాల లోగాని ఎక్కడా చూడలేదు. శాస్త్రజ్ఞులు వారి పరీక్ష నాళికలలో ఇంతవరకు వానిని వేరు చేయుటంలో ఓడిపోయారు. అంతరిక్ష పరిశోధకులు వారి రేడియో టెలిస్కోపుల అత్యున్నత శక్తులతో దాని నెప్పుడూ పట్టుకోలేకపోయారు. అత్యంత మేధావంతు లయిన తత్త్వవేత్తలు దాని ఉనికిని ఇంకా అంచనా వేయలేదు.

"అది అన్నింటి కంటె సామాన్యమైనది. అన్నిటి కంటె చిన్నది. అన్నిటి కంటె నిరాడంబరమైంది. అత్యంత సులభంగా ఉపేక్షింప బడేది. దానికి సరి అయిన మాట కూడా లేదు. మనం దాని గురించి మాట్లాడే సమయంలో దానిని 'ప్రేమ' అని వ్యవహరిస్తాం.

"ఈ వస్తువు గురించి రచయిత ఏమీ ఎరుగడు. అది కోరబడే వస్తువని, అన్వేషింపదగ్గ వస్తువనీ అతడు నిస్సంశయంగా ఎరగడు. పందలాది ప్రజానురంజక గీతాలతో శ్రుతి కలిపి కర్ణ కఠోరంగా ఆ పదాన్ని బాకా కొట్టగా, అతడు దానిని విని ఉన్నాడు. ఇతరమత బోధకులు అపదాన్ని

కొద్దిగా భిన్నమైన భావంతో వాడగా గమనించాడు. ఈ రకంగా అతనికీ పదం తారసపడింది. వారు "భగవంతుడు ప్రేమిస్తాడు, పాపిని ద్వేషిస్తాడు. అవిధేయులని శాశ్వత నరకానికి పంపుతాడు" అని చెప్పారు. ఎందుకనో ప్రేమ అనే పదం గురించి రచయిత ఏనాడూ పెద్దగా అర్థంచేసుకో గలిగిలేడు. ఈ పదం గురించి అంతరార్థాంతం ఎందుకు చేస్తున్నారో అర్థం చేసుకోలేదు.

"అప్పుడు ఒకరోజు పూర్తిగా అనూహ్యంగా, దాని కొరకై అన్వేషించకుండా, వెదకవలసింది ఏమిటో అయినా తెలియకుండా, గ్రామీణ దక్షిణ భారతావనిలో ఒక మూరు మూల, సరళస్వభావం గల ఒక చిన్నస్త్రీ సాన్నిధ్యంలో తననుతాను కనుక్కొన్నాడు. ఆమె మౌనాలూ, ప్రసంగాలూ, అందరినీ సిద్ధంగా హాయిగా సమ్మతించటం, ప్రతి ఒక్కరియెడ ఆమెకుగల గౌరవము, శ్రద్ధ, రచయిత ప్రశాంతంగా గమనిస్తుంటే, ఎవరూ ఎరుగని, ప్రతివారూ మాట్లాడుతున్న వస్తువు ఇక్కడ ఉన్నదని అతనికి అకస్మాత్తుగా అనిపించింది. ప్రతి ఇంటి పైకప్పునెక్కి ప్రబోధింపబడినా, అంతటా ఆచరణలో మృగ్యమయిన - అవ్యాజమయిన, పవిత్రమైన, నిస్వార్థమయిన, అపరిమితమైన ప్రేమ ఇక్కడ ఉంది.

"మొట్టమొదటి సారిగా ఆమె దగ్గరకు అతనిని

చేర్చిందేది? మళ్ళీ తిరిగి యింకోసారి అతనిని తెచ్చిందేది? తన స్వదేశానికి దూరంగా అక్కడ అతనిని ఉంచిందేది?

"అతడెప్పుడూ కోరనిదీ, అన్వేషించడానికి తెలియనిదీ, మిక్కిలి చిన్నదీ అయిన విషయం అదే క్షణంలో అవధులు లేనిది - అదే ప్రేమశక్తి"

—: జయహో మాతా :—

—: ● :—



గగన సీమలో ఆలయ శిఖరాలు

## రచయితను గురించి

రిచర్డ్ షిఫ్‌మన్ అమెరికా దేశం న్యూయార్కు నగరంలోని సంపన్న కుటుంబానికి చెందిన పట్టభద్రుడు. పురాతత్వ శాఖలో మానవ పరిణామ వికాస శాస్త్రాన్ని అభ్యసించినవాడు. విద్యార్థి దశలో ఆధునిక పాశ్చాత్య యువకుల వలెనే విలాస వంతమైన జీవనంగడపి దానిలో తృప్తిని పొందలేక భారతీయ సంస్కృతీ సంప్రదాయాలకు ఆకర్షితుడై భారతదేశానికి వచ్చి ఆ సేతు శీతాచలం పర్యటించి దైవీ శక్తి సంపన్నులైన ఎందరో మహానుభావులను, యోగులను దర్శించి తను అన్వేషిస్తున్న సత్యపదార్థాన్ని 'జిల్లెళ్ళమూడి అమ్మ' లో చూచిన తాత్వికుడు పత్రికారచయితగా సత్యసందర్శనం చేసిన జిజ్ఞాసిగా తన సునిశిత పరిశీలనా దృష్టిని, అనుభవాన్నీ, తృప్తినీ, నైపుణ్యాన్నీ "Mother of All" అనే ఆంగ్లగ్రంథంలో వివరించిన మేధావి. అన్నీ ఉన్న విస్తరి అణిగిమణిగి ఉంటుందన్నట్టు ఇన్ని లక్షణాలున్నా అతి నిరాడంబరునిగా జీవనం సాగించే బాటసారి. జిల్లెళ్ళమూడిలోని మాతృశ్రీ మెడికల్ సెంటరు నిర్వహణ బాధ్యత వహిస్తున్న సమాజసేవకుడు —

---

ప్రకాశకులు : వెల : రూ. 10

శ్రీ విశ్వజననీ పరిషత్ – జిల్లెళ్ళమూడి

బాపట్ల తాలూకా - గుంటూరు జిల్లా - ఆం. ప్ర.